# కర్ణోత్పత్తి - 2

(మహాభారత తత్త్వ కథనపరిశిష్ట నిరాసము)

రచయితను చేను

మేడూరుపాటి రామభద్ర వయనులు

# ఉపోద్ఘాతము

నేను వ్రాసిన కర్ణోత్పత్తి పొత్తమును విమర్శించుచు శ్రీ వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారిచే వ్రాయబడిన మహాభారతతత్త్వ కథన పరిశిష్టమును జూచినపిమ్మట పరిశిష్ట నిరాసమను పేరున నీ పుస్తకమును వ్రాసి వారి పరిశిష్ట గ్రంథ రచనా ఫలితముగ కానుక నొసగుచున్నాను. ఈ పొత్తమున పరిశిష్టమునకు సంబంధించినవి కాకున్నను 'స్వర్థయా వర్ధతేవిద్యా' కావున నాకు తెలిసిన విషయములను లోకులకుపకరించక మానవను భావముతో వెలిబుచ్చినాను. శ్రీ శాస్త్రిగారు పూర్వము చివరి కరపత్రములో తెలిపినట్లు వాకోవాక్యతయే ప్రధానాశయము కలవారు. సమాధాన సౌష్ఠవము నొప్పువారు కారు. కావున నీ నిరాసము నుత్తరించుకొనినచో నవసరమువెంబడిని సమాధాన మొసగగలను. ఈ పొత్తము ముద్రించబడి చాలాకాలమైనది. అనుబంధ విషయములు మాత్రము చేరుట కాలస్యమగుటచే, ముద్రణాలయమువారిని (సరసులగుటచే) బుజ్జగించి నేటికి బయల్పరచగలిగితిని. తాము సేకరించిన పలువిషయముల తెలుపుటలో నాకు సాయపడిన నా ప్రియమిత్రులు శ్రీ పురిపండా అప్పలస్వామిగారికి కృతజ్ఞుడను.

వేగేశ్వరపురం
పశ్చిమగోదావరి

వేలూరుపాటి రామభద్ర చయనులు

అహం

శ్రీ

# కర్ణోత్పత్తి 2 - పరిశిష్ట నిరాసము

యేనాపి, కేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం,
జానంతు, తే,కిమపి, తాన్ప్రతి, నైష, యత్నః
ఉత్పత్స్యతే, మమతు, కోపి, సమానధర్మా,
కాలోహ్యయం, నిరవధి ర్విపులాచ, పృథ్వీ॥

అధీయానః పండితం మన్యమానో
యోవిద్యయా హంతి యశఃపరేషాం
ప్రభ్రశ్యత్యసౌ, చరతే నపుణ్యం
లోకా_స్తస్య హ్యంతవంతో భవంతి॥

నేనువ్రాసిన కర్ణోత్పత్తి పొత్తమును సమీక్షించుచు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి అనువారు ‘మహాభారతకథ నపరిశిష్టము’ వేసిన నా పుస్తకము ముఖపత్త్రముపైన ‘నేను, ఉపోద్ఘాతానంతరము అహం’ పదముల నుపయోగించుట నాక్షేపించుచు, ప్రశ్నించిరి. ఆసాంప్రదాయమునీవు గ్రహింపలేవు. ఉత్తమపురుషస్థితి కొంచెన నవగతము కాగలదు. ‘అహం’ వినయోక్తి కాబడిన ‘అహంబ్రహ్మాస్మి’ ‘మాసానాం’ మార్గశీర్షోహం, ఇత్యాదులుపష్టంభకములు కానేరవు. ‘అహం’ వినయసూచకము కావుననే నమస్కా—

రాదులందు మాత్రమే కాక నివేదనాములందుగూడ వాడబడి నట్లు గన్పడుచున్నది. 'వసిష్ఠోహ మిత్రిప్రీత్యా సచాత్మానం న్యవేదయత్' ఆది. ప. 173 అ 18 శ్లో — 'న్యవేదయ చాత్మానం తస్మై లక్ష్మణపూర్వజః, రా - అయోధ్యా కాండము-"శౌరిసూనుః ప్రవక్ష్యామి లక్ష్మ్యాః పదాన్యహం" ఇట్టివే. 'పరస్య స్వనామ ప్రోచ్యాహమితి, - గౌతమస్మృతి 6 అ. నామ శ్లో, అహం, ఉదహరించిన నేను సాంప్రదాయము ననుసరించలేదందురే? వీరు! 'అహం' కు 'నేను' అర్థ మయినందున 'నేను' వ్రాసి పేరు వ్రాసితిని. మేము అను టలో వినయమున్నదా? విద్యాపారీణత వినయమును గ్రహింపనీయలేదు కాబోలు! మీాగహం అన్నారు కనుక 'మేము' వాడినానందురా? కథకులు! కథన ప్రారంభము నుండియు వీరిని మేము ఆవేశించినది. ఈ పదప్రయోగము royal we అనుట కలదు. 'మేము' రాజసముగ బెద్దలు చెప్పుదురు. అహంకార మమకారశబ్దములు వేదాంతపారీణు లుపయోగించుకొననగును కాని ఇతరులు వాడకూడదని వారెంచియుందురు. వేదముల అంతమందు పారీణుడను కాకుంయుటచే నేనాశబ్దము నారీతిని వాడలేదని పండితులకు మనవి జేయుచు "మే, మె. మే, మేలు. తెలుచయ్యో మేలు మేలు" నైషధము. మే, మే పార్వతీ పరిణయము. (తొండ మాన్ రాయ రఘునాధుడు) 'మేమే' యనుటను వారికే వదలివేయుచున్నాను.

మహాభారతపదార్థజాలమును స్పష్టముగా బుద్ధికి గోచరింప జేయుగలది వ్యాఖ్యాప్రదీపమే॥ అని. పరిశిష్టము ౧౫ పుట 7 పేరా — మహాభారత పదార్థజాలమంతయు నంధకారావృతమని మహాభారతతత్త్వవేత్తలగుటచే గ్రహించిరి శాస్త్రిగారు. నిగూఢార్థము శాస్త్రిగారికి నిగూఢమే అయినది.

బహూ న్సమాహృత్య విభిన్న దేశ్యాన్
కోశా న్వినిశ్చిత్యచ పాఠమగ్ర్యం
ప్రాచాం గురుణా మనుసృత్య వాచం
ఆరభ్యతే భారతభావదీపః॥

శాస్త్రిగారి వలె "ఆప్రతి గాదీప్రతిగాదు. మహాభారతప్రతి" యని వెక్కిరింపుగా గాక, భిన్నపాఠములు కల భారతముల జూచి కొన్నిపాఠములను ద్రోసివైచి తనకు శ్రేష్ఠముయినదని తోచిన పాఠమునకు వ్యాఖ్యను వ్రాసినాడు నీలకంఠుడు.

ఈశప్రసాదా దవితుం స్వవంశ్యాన్
భగీరథేనేవ మయా ప్రణీతా
ఏషా మహాభారతతీర్థగంగా
లోకత్రయీజాడ్య మలంధునోతు॥

భగీరథుడు తనవంశమువారిని దరింపజేసికొనుటకు గంగతగును, కాని లోకత్రయీజాడ్య మణచుటకు భారతతీర్థ

గంగ యెట్లుసమర్థమగును? తానురచించిన భారతభావదీపము గంగ (త్రిపథగ) కాదు. ప్రసీతా-గంగేవ=తీర్థం-వ్యాఖ్యా॥ అనికానోపు నాతనిభావము. ప్రకృతి చేతనే జడమగు గంగ జాడ్యము (జడభావము) నెట్లణంప సమర్థమగును? అంధ కారావృతభారత పదార్థజాలమును సృష్టించి వ్యాసుడు శాస్త్రిగారి దృష్టిని దోషింపజేసినాడు. వీరి పురాణప్రవచన మున కీమార్గ మనుకూలమేనా? నీలకంఠుడు నిగూఢార్థచయ ప్రకాశమని తనవ్యాఖ్యకు బేరిడుటకు ముందు నిగూఢపద బోధిని నెరుగుననుటకన్న ఎరుగడనుటయే తగునేమో; వ్యాఖ్యారచనము ప్రతిపత్తిని గావచ్చు నప్రతిపత్తిని గావచ్చు ననినారు కథకులు. వ్యాఖ్యలలో శబ్దగతధ్వన్యాదుల జూపి ఆలోచనామృతము గల్పించుటతగును కాని తమపాండిత్య ప్రకర్షను జూపుచు 'వేదములను' వ్యాకరణమును, బలు పుగ జూపి ప్రయోగరాచికతను రూపుమాపుచు నన్యథాప్రతి పత్తి సిద్ధించిన ననుట తగునా? నిఘంటు, వ్యాకరణ ప్రయోగముల మాత్రమేచూపుచు రచనమును సాగించినచో నదిభవ్యముకాకయే పోవును. సారస్యము నెంచక తమబుద్ధికి దోచిన, తనువిశ్వసించిన దానినే పట్టుకొని పెనగులాడుచు తత్ప్రకటనమున కు మార్గముల జూపనెంచు విమర్శకు లాశర గతికి చేరెదను. రామాయణవ్యాఖ్యాతలు మొదలు నేటికి దొంబదిపాళ్లు తనుపాండిత్యమును వెల్లడించు నుద్దేశ్యము కలవారే. విమర్శకులు కూడ నౌద్ధత్యమును జూపుచునే

వ్రాయుచు వచ్చెను. దుర్జనముఖపద్మపాదుక, దుర్జనముఖచపేటిక, మనోరమాకుచమర్దనము, మొదలయినవి పాండిత్యముతో పాటు సంతాపాటవమును దర్శింపజేసినవే. పరిశిష్టము 5 పేజీలో జెప్పినట్లు నీలకంఠునెరుగని నేనాతనిని ద్వేషించుటయెట్లు? 1930 లో ముద్రింపబడిన మూలగ్రంథ కాపీయును నాయొద్దకలదు. నీలకంఠునిపేరున మొత్తము మూడుముద్రితములైన బొంబాయి 1799—1913 (పరిశిష్టము 4 పుట) వ్యాఖ్యలాతనివి కావనవలెనే! మొత్తము వ్యాఖ్య వానినన్నాతనిదే కానోపును. చిత్రశాలా ముద్రణము. శాస్త్రిగారు చూచుచున్నది. పురాణప్రవచనము జేయుచున్నది. ఈముద్రణము 1929 నుండి 1933 వరకు సాగినది. బొంబాయి 1799 గోపాలనారాయణ ప్రింటింగు ప్రెస్సు. బొంబాయి 1913 వైభవప్రెస్సు. 1929 చిత్రశాలాప్రెస్సు ముద్రణములు. మూలము, వ్యాఖ్యకలిసి యున్నవి. వానిలో 1929 ముద్రణములోని టిప్పణి యెవరిది? కొన్ని నీలకంఠుని మూలములున్నవి. నీలకంఠుడు ప్రక్షిప్తములని వదలివేసిన వానిని జేర్చిన వ్యాఖ్యలలోని శ్లోకములు ప్రక్షిప్తములేనా? ఇట్టివానిని శాస్త్రిగారు మహాభారతతత్త్వకథకులు కావున పరిశీలించి బయల్పరచవలసినవి. నీలకంఠుని వ్యాఖ్యలోనివానిని వావిళ్లవారు టిప్పణిగ జేర్చినారనుచున్నారు శాస్త్రిగారు. పురాణం హయగ్రీవశాస్త్రిగారి భారతతత్త్వ వచనము నేమందురు? టిప్పణులలోనే ప్రక్షిప్తములని వ్రాసిన

వున్నచో ఆమాటలు నీలకంఠునివి కావనుట కవకాశము లేదా? చెన్నపురిని వదలిపేసి కుంభకోణము త్రోవబట్టినట్లే మరియొకరు నీలకంఠుని కాదని త్రోసిపుచ్చి యాతనివలెనే తమటిప్పణిని జేర్చినారనుటలో దప్పేమి కలదు? నిలకంఠీయ గతశ్లోకములు కర్ణదుర్యోధనులందేవగింపు కలిగినట్లున్నవని నేను వ్రాసినవాసి నొప్పుకొనిన వీరాశ్లోకములను నేను ప్రక్షిప్తములని వ్రాసినానని యేలనో? వీరినీలకంఠుడు పక్షపాతి యని నేననలేదు. ఆశ్లోకములనుచున్నవి.

1929 వావిళ్ళ ముద్రణము. 'యదిజానాతి మాంరాజా ధర్మాత్మా సంయతేంద్రియః । కుంత్యాః ప్రథమజంపుత్రం ననజాతు గ్రహీష్యతి' – ఉద్యోగ - ప 141 అ - శ్లో 22 - 'ప్రాప్యచాపి మహద్రాజ్యం తదహం మధుసూదన । స్ఫీతం దుర్యోధనాయైవ సంప్రదద్యా మరిందమ వాఖ్యలో' నీల కంఠుడు మాత్రము "దుర్యోధనుడు దుర్మార్గుడైనను" అనివ్యాఖ్యానించెను. మూలగతము కానియర్థమది. అట్లే ఉన్నచో ప్రకరణపు సొగసే నశించును. దీనినిగమనించి నాడానీలకంఠుడు? కర్ణదుర్యోధన పాత్రముల విశిష్టతను నశింపుచేయుటలేదా! వ్యాఖ్య! చూడండి.

అట్లుండదగినదా! అనియే వీరిని నేనడిగినది? వీరి నీల కంఠ పక్షపాతమువలె కర్ణదుర్యోధన పక్షపాతము నాకు లేదు. భారతానేక పక్షపాతమును దొలగించుటను నేను వాంఛించు

చున్నాను. మొత్తపు నీలకంఠీయములో ప్రక్షిప్తములున్న వని ఆతని పాఠ, శేష, ప్రకల్పనాది, వాక్యములు తెలుపు చున్నవి. 'యస్యప్రమాణం' అనునాతడు ప్రామాణికు డనుటయెట్లు? నాదేప్రమాణమని నేననుటలేదే. ఆ శాస్త్రిగా రనుకొనుచున్నారు. విద్వాంసులమని వారనుకొనుచు నాది స్వేచ్ఛావాదమగుటచే విశ్వద్గ్రాహ్యముకాదని వ్రాసిరి. వారు నిత్యప్రామాణికులు. నేను ప్రమాణస్వీకర్తను కానని వారే చెప్పుట నాకు శుభదాయకము. నీలకంఠుడు బహుగ్రంథ పరిశోధనము జేసినవాడననుటచే నాతనిమాటలు గ్రాహ్యములే యనుచున్నారు కథకులు. భారతముద్రాపకులందరు బహు గ్రంథపరిశోధకులమనుచునే వచ్చిరి. "కతినతర తత్తత్కరణ వ్యాఖ్యాభిః సంయోజితః" నేలటూరివారు. పురాణం హయ గ్రీవశాస్త్రిగారల్లే వ్రాసిరి. పూర్వముద్రితములు లోపభూ యిష్ఠములనుచునే, పునర్ముద్రణమును సాగించుట పరిపాటి. రచయితలుకూడ నల్లే. నిగూఢపదబోధినిని వ్రాసిన సర్వజ్ఞ నారాయణుడు (1200) కూడ గొన్నివ్యాఖ్యల జూచితి నని నాడు. విమలబోధుడు (1150) మహాపౌరాణికోపాధ్యాయ త్రివిక్రమ (1100) కృత మహాభారత తాత్పర్యార్థ వివరణ టీక నెరిగినవాడు. భారతాచార్య దేవబోధ (ఔత్తరాహ 1050) (జ్ఞానదీపికావ్యాఖ్య) స్వామికి తరువాత వాడు. అర్జున మిశ్రునకి (1374—1400) ముందుండినవాడు. వ్యాఖ్యాతలు కాని నిఘంటురచయితలు కాని సంగ్రహీతలు కాని తాము

లోకోద్దీపకులమని వ్రాసికొనుటకలదు. రఘువంశవ్యాఖ్యాత లగు దినకరమిశ్రుడు, వల్లభుడు, హేమాద్రి, విజయపురి చరిత్రవర్ధనుడు, మల్లినాథుడు మొదలయినవారు పూర్వవ్యాఖ్యాతల దోషముల నుల్లేఖించలేదా ? కొన్ని వ్యాఖ్యలు కాళిదాసునిగూడ విమర్శించినవి. మేదినికరుడు ( మేదినీనిఘంటు కర్త 1250 ) విశ్వప్రకాశనిఘంటుకర్తను 'అపిబహుదోషం విశ్వప్రకాశం' అని నిందించినాడు. ఇతని మేదినిలో విశ్వ నిఘంటుకన్న విశేష మేమికలదు ? తాను షట్పదగాథాకోశ మును వ్రాసినాననియు సుమా రరువది నిఘంటునామలింగాను శాసనములను, పాణినిపదానుశాసనమును, పురాణములను జూచితిననియు, వ్రాసికొనినవాడు. భాగురి, కాత్య, హలాయుధ, హుగ్గ, అమరసింహ, శాశ్వత, నిఘంటుకర్తల పేర్కొనిన మంఖునిగాని, అనేకార్థకోశకర్త ధన్వంతరిని గాని, పేర్కొనలేదు. అభిధానచింతామణి, నామమాల మొదలగు నిఘంటువులను, కావ్యానుశాసనమును, వ్రాసిన హేమచంద్రు నెఱుగడు. దేవబోధాది భారతవ్యాఖ్యాతల పేర్ల వినలేదు. శాస్త్రిగారి మాఘమానసేగవాల నెరుగడు. విశ్వప్రకాశకర్త మహేశ్వరనాముడు "శ్రీవైద్యరాజచంద్రముక్తాశేఖరస్య కవిరాజపరమేశ్వరస్య పద్యగద్యవిద్యావిధేః" అని వినుతినొందిన గొప్ప పండితుడు. మేదినీకరు డీతని త్రోసి పుచ్చెను. అమరపదపారిజాతమును వ్రాసిన మల్లినాథసూరి నూఱునిఘంటువుల నుదాహరించెను. చూడుడు. త్రిలింగపత్రి

16 - 8 - 49 లోని నావ్యాసమును. మేదినీకరుడు తనకాలము నాటికి విశ్వప్రకాశమునకున్న ప్రచారఘనతను సహించలేక పోయినాడు కానోపు. నీలకంఠుడు నూటికి దొంబదిపాళ్ళు మేదినీకరునే గ్రహించెను.

'ఉత్తానేష్విహ కోశవిగ్రహాఽలం పద్యేషు నైవాశ్రితౌ' అని వ్రాసికొని తా నుదహరించినకొందఱ నిఘంటురచయితల పేర్ల నెత్తికొనుటేల? వ్యాఖ్యోదాహృతస్మృతి కర్తలపేర్ల నెందులకు జెప్పలేదు? శాస్త్రిగారు తెలిసికొని ప్రకటించగల రేమో? ఈలేఖ పాఠములను, గ్రహించి, అనుటకు బదులు కల్పించియనుట ఎట్టిదో? అర్జునమిశ్ర సర్వజ్ఞనారాయణులు విరాటపర్వములోని దుర్గాస్తవమును వ్యాఖ్యానించలేదు. తిక్కన వదలివాడనుకొనుచున్నదదియే. సర్వజ్ఞనారాయణుడు ప్రక్షిప్తమనుచు వదలిన కీచక, సైరంధ్రీ ప్రథమ భాషణము నీలకంఠు డందుకొనెను. సుధేష్ణా కుతంత్రదోషత నది తొలగించుచున్నది. సుధేష్ణాకుతంత్రప్రేరణ నెన్నక కీచకు నింటికి సైరంధ్రి వెళ్ళుట కవకాశము నీకథాశూన్యత కల్పించుచున్నది. సైరంధ్రి స్వామినికి ప్రత్యాఖ్యానము చేసినదను దోషము కన్పించదు. పండితులు బాగుగ పరిశీలించ దగినదే యీ విషయము.

శాస్త్రిగారు నేనుచూచినది 1929 వావిళ్ళముద్రణ మొక్కటే యనుకొనిరి. (పరిశిష్టము. 4 పేజి.) కర్ణోత్పత్తిలో

నేసుచూచిన భారతములను గురించి వ్రాసినది వీరిదృష్టి కందక పోయెను! భారతమునకు సంబంధించిన గ్రంథముల నేనిసి జూచితినో త్రిలింగపత్రికలు తెలుపును. పరిశిష్టము 5 పేజీలో "మహారాష్ట్రపండితులు నీలకంఠ వ్యాఖ్యను విశేషముగ నాదరించినట్లు ముద్రాపకులు వ్రాసినదానినిజూపిరి. వ్రానామహారాష్ట్రదేశములోనిదే. అచ్చట పలువురు పండితులుకూడ పరిష్కరించి ప్రకటించుచున్న మహాభారతాదిపర్వ పీఠికలో నిలకంఠవ్యాఖ్య నిరసింపబడినది వీరెరుగరు. (Not reliable and vulgar) విశ్వసించదగినది కాదు. అసభ్యము. అని. ఈవ్యాఖ్యనుగురించి నేనువ్రాసిన కర్ణోత్పత్తి పీఠిక 12 పేజీ 10 వ పంక్తిని జూడగలరు. రత్నగర్భుడు - దాక్షిణాత్యుడు. నీలకంఠుడు. మహారాష్ట్రుడు. తమకు లభించిన రెండుమూడు వ్యాఖ్యలలో తమరాష్ట్రములో మాత్రము పొగడబడుచున్నట్టి వ్యాఖ్యను ముద్రించినారు మరిచి చిత్రశాలా ముద్రాపకులు. ఇతరభాగములందలి భారతములలోగూడ యూతని భావదీపిక ముద్రింపబడియున్న విషయము నేమందుము? అప్పటికి మొత్తముగా దొరకిన వ్యాఖ్య యదియొక్కటియే కానోపు. ఆతడక్కడివాడేయగుట వారికిపి శేషము. దేవబోధాదుల వ్యాఖ్యలు దొరకినప్పుడు కొందరు ముద్రించిరి. మూలములేని భారత భావదీపిక మాత్రము 1900 లో అఘోరనాథముఖర్జీ కలకత్తా లో ముద్రించిరి. వీరుచూపించిన చిత్రశాలాముద్రణము 1929ది. కావున నీముద్రణములోనివాక్యములకు విలువ కట్టనక్కఱలేదు.

ఆది సభాపర్వములు జ్ఞానదీపికతో ముద్రింపఁబడినవి. విరాట పర్వము. అష్టటీకోపేతము ముద్రితము. అట్లే ఉద్యోగము పంచటీకోపేతము ముద్రింపబడినది. భీష్మపర్వము జ్ఞానదీపికతో ముద్రింపఁబడినది. యీ మొదటివి రెండును నావద్దకలవు.

## భారత ప్రక్షిప్తములు

ఈ విషయమున నేన వ్రాసినదానికి సమాధాన మిడుచు నీలకంఠుల దృష్టి తమకు దెలుపుచున్నారు. భారతములో దనకు బ్రక్షిప్తములని తోచినవానిని "ఇత్యన్యే" అనుచు ద్రోసివేసినాడు నీలకంఠుడు. అస్మిన్పర్వణి, శ్రీ వేదవ్యాసేన సప్తవింశత్యధిక ద్విశతాధ్యాయాః ప్రతిజ్ఞాతాః. తథాపి లేఖకప్రమాదాత్ చతు స్త్రింశదధికద్వి శతాధ్యాయాః వర్తంతే. తథాపి శ్లోకవై షమ్యం దృశ్యతే. తత్క్ష్మాత్రాధికం నజ్ఞాయతే. ఏవం అన్యపర్వ స్వపి న్యూనాధికవిషయే జ్ఞేయం. ఈ వ్రాతవలననైనను నీల కంఠునిదృష్టి కథకులకు దెలిసినట్లు గన్పించదే. భారతము లోని ప్రక్షిప్తములను మీరొప్పుకొనరని నేననగ నేనొప్పుకొన వలెనా" అనుచున్నారు. వారు వ్రాసినకథనము లారు నాదృష్టి తోనే వ్రాసినారేమో. వారికేటిప్పుడలలేని వారిపొత్తము లిపుడు బెట్టూదరించెదరు? తమ ప్రవచనమే శాస్త్రానుగత మనునా రొప్పుకొనున్వభావము కలవారైయుండెదరని స్ఫుర పరచుకొనుచున్నారు. మీరు తప్పు కొనెదరు కాని ఒప్పుకొనరు ఏది గ్రంథస్థమో ఏదిపాఠాంతరమో నిర్ణయించగలశక్తి, వారి.

భా=సభా 5-అధ్యాయము-కచ్చిద్వినయసంపన్నో కులపుత్రో
బహుశ్రుతః
అనసూయు రసంకీర్ణః సత్కృతస్తే పురోహితః
రా=కచ్చిదగ్నిషు తేయుక్తః విధిజ్ఞో మతిమానృజుః
హుతంచ హోష్యమాణంచ కాలే వేదయతే సదా॥
భా=కచ్చిదగ్నిషు తేయుక్తః విధిజ్ఞో మతిమానృజుః
హుతంచ హోష్యమాణంచ కాలేవేదయతే సదా॥
రా=కచ్చిత్తే సఫలావేదాః కచ్చిత్తే సఫలం ధనం
భా=కచ్చిత్తే సఫలావేదాః కచ్చిత్తే సఫలం శ్రుతం॥
రా=గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పధం ప్రతిపన్నస్య కార్యంభవతి శాసనం॥

ఈ శ్లోకము భారతమునందే కాక చాలాపురాణము
లలో జేరినది—

రా—సుం—17—19 స్సర్గములు—సీతావర్ణనము—
సుకుమారీం సుజాతాంగీం రత్నగర్భ గృహోచితాం
తప్యమానా మివోష్ణేన మృణాళీ మచిరోద్ధృతాం॥
ఇవచోద్ధృతాం కానోవును.
భా=వన-ద్రౌపదీవర్ణనము—
సుకుమారీం సుజాతాంగీం రత్నగర్భగృహోచితాం
దహ్యమానా మివార్కేణ మృణాళీ మివచోద్ధృతాం
ఇట మఱొకశ్లోకము పునరుక్తమయినది.

రా—ఆకులాం పద్మినిమివ
భా—వ్యాకులాం పద్మినీమివ

ఇట రామాయణమునగూడ, "పద్మినిమివవిధ్వస్తాం" అని పునరుక్తమయినది. ఇట్లు రామాయణములోని పదములు, శ్లోకములు భారతములో జేర్చబడినవి. వ్యాసుడే యీచౌర్యము నాచరించెనందురా? భారతములో బాదపూరణార్థమేర్పడిన నృప, రాజన్, సతీ, వరవర్ణినీ, మొదలయిలవాని ననుష్టుప్‌వృత్తములుగ మార్చిన సుమా రిరువదివేలు శ్లోకములు తయారు కావచ్చును—

భా—ఆస్తిక-456- స తం తపోరతం మందం శనైః కృపయతే తుదన్
జరత్కారుం తపోలుబ్ధం మందాత్మాన మచేతనమ్॥

ఇట్టివి కొల్లలు కొల్లలు. చెప్పినకథలనే తిరిగిచెప్పిన వానిని గొన్నిటిని కర్ణోత్పత్తిలో జూపియే యున్నాను. భా. ఆది. ప్రథమాధ్యాయము 231 శ్లోకము మొదలు 244 శ్లోకమువఱకు గల శ్లోకముల జూడుడు. నారదు డీపేర్లను పుత్రశోకాభితప్తుడగు శైబ్యునకు చెప్పినట్లు గలదు — కాని ఈకాలవశంగతులలో శైబ్యుడు చెప్పబడినాడు. ఆతడు మఱియొకడనుకొనవలెను కానిపొరబడినా డనకూడదా? ఇట్టియసందర్భము లెన్నియో భారతమున గలవు. భారతమున నున్నవిగ వినికిడికల కొన్నిభాగములు దృశ్యమాన

భారతప్రతులలో లేవు. యుద్ధప్రారంభమున కిరువదిరోజులు ముందుజరిగిన వ్యాసకర్ణసమాగమము నేడే ప్రతిలోను గన్పించుటలేదు. చూడుడు యస్. బి. దీక్షిత్ గారు వ్రాసిన భారతీయజోతిశాస్త్రము (మరాటీ) ఇది శ్రీ జ్యోతిర్భూషణ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారివద్ద నున్నది. ఈ దీక్షితులుగారు తిలకు మహాశయులచే ప్రామాణికులుగబలుచోట్ల పేర్కొనబడిన యాతడు. బహువివాదగ్రస్తమగు విషయమును జూపెదను. గ్రంథవిస్తరభీతి నయినను వదలలేక పోయితిని. కీ. శే. పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ధర్మజావిసీతిని దెలుపు ప్రకరణమున నీశ్లోకము నిచ్చిరి. "ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా సభామాగమ్య పాంచాలి శ్వశురస్యాగ్రతో భవ॥" పాండవద్యూతపరాజయస్థితి యిది. ద్రౌపదిని రజస్స్వలావేషమున సభకు రమ్మని ధర్మజుడాదేశించినా డనుట కిదిచూపరడినది. కుమారిలభట్టును. సాక్షిగ గొనిరి. అనుమానమున నిజస్థితి నరయుటకు బీఠికాపురమున బండితవర్యులు కీ. శే. దెందుకూరి నరసింహశాస్త్రిగారి వద్ద కుమారిలుని తంత్రవార్తికమున్నదని వినిచూడ నరిగితిని. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తీసికొనివెళ్లిరి భారతవిమర్శప్రయత్నమున నన్ను సంప్రదించుట కాపొత్తమును గొనివచ్చెదరని శెలవిచ్చిరి. అట్లే వారణాసివారువచ్చిరి. నేనుపై భాగమున కుమారిలుడు వ్రాసినదానిని వారివలననే చదివించి వింటిని, ఆరాత్రి శ్రీ సుబ్ర

హ్మణ్యశాస్త్రిగారింటనే యుండి మరునాడు కాకినాడ వచ్చి తిని. సంశయము తీరనేలేదు. 30-12-44 నాకు బళ్లారిజిల్లా ఆదోనిలో జరిగిన సన్మానసందర్భమున బదిరోజు లుంటిని. శ్రీవ్యాసాచార్యులనువారియొద్ద యుక్తిమల్లికయను తాళ పత్ర గ్రంథమును జూచితిని. అది వాదిరాజతీర్థరచితము. ఆగ్రంథమున "మదీయేలక్షాలంకారే, అనున దుదాహృతమై నది కనబ్బట్టినది. పూనా ఓరియన్టలిష్టు పత్రికలో భారతవ్యాఖ్య లను వ్యాసమునను మాడభూషి కృష్ణమాచార్యుల వారి సంస్కృతభాషా చరిత్రమునను వాదిరాజు భారతవ్యాఖ్యను వ్రాసినట్లున్న దానిని జూచితిని. వావిళ్ల వారి నాగరలిపి భారత ముద్రణపు సంపాదకులగు శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారితో సంప్రదించితిని. వారియొద్దకల ఈవాదిరాజు తీర్థీయ లక్షాలం కారమును జూచి సంశయాస్పదమగు పైశ్లోకమును జూడగ నిట్లున్నది.

ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానారజస్స్వలా
సభామాగమ్య పాంచాలీ శ్వశురస్యాగ్రతో భవత్ ॥

ఈపాఠము కుమారిలునికి దొరకక తికమకబడినాడనియు నన్నయభట్టుకీపాఠముదొరకినందుననే 'రజస్స్వల అయియున్న' అనివ్రాయగలైననియు నూహించితిని. కీ. శే. ఉప్పులూరి దక్షిణా మూర్తిశాస్త్రిగారి వద్దనున్న బొంబాయి ప్రతిలో "ఈవేష ముతో సభకు వచ్చినచో దుర్యోధనుని జనులు నిందించెదరు

అను సర్గములకల మహాశ్లోకములు కూడ గన్పించినవి. కొంత కాలమునకు శ్రీ కొటమర్తి చినరఘుపతిరావుగారు వారింటనే యున్న నాకు తాళపత్రలిఖిత మహాభారతప్రతి నొక దానిని జూపిరి. ఆప్రతి ప్రస్తుత మాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున గలదు. అందీపాఠము కలదు. పాంచాలీ-అభవత్. దీనిని జూచి కొటమర్తివా రాశ్చర్యచకితులైరి, వీరి సుయోధనవిజయము పలువుర నారాటమునకు దింపినది. ఉప్పులూరి వారి ప్రతిలోని శ్లోకములు మాకు నీప్రతిలో లేవు. ఆశ్లోకమును తరచు చదివి కంఠస్థము చేసికొంటిని. మిగిలిన విషయముల నప్పుడు మనసున బట్టించుకొనలేదు. మండపేటలో శ్రీ. శ్రీ. దేవులపల్లి నరసింహశాస్త్రిగారి సన్మానసభా సందర్భమున శ్రీ యర్రమిల్లి జగన్నశాస్త్రిగారి యింటిమొద్ద గోష్ఠిలో వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నన్ను బ్రశ్నింపగ నీవిషయమును చెప్పితిని. కాని వారు తత్త్వైకధనమున దీని నెత్తుకొనలేదు. కవిసార్వభౌముల సన్మానసందర్భమున శ్రీ జటావల్లభుల పురుషోత్తముశర్మ, ఎం. ఏ. గారి అధ్యక్షతను విజయవాడలో జరిగినసభలో నీవిషయమును వెల్లడింపగ మహిన్నుతులు, వివేకనిధి శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగా రత్యంతానందభరితులైరి. పిమ్మట పిఠాపురమున సమావేశపరచబడిన సభలో కృష్ణగార్హస్థ్యము గురించి నేనుపన్యసించుచు నైవిషయమును వెల్లడించినతఱి నధ్యక్షులగు వెంపరాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగా రాలింగన

మొనర్చుకొని పాతివ్రత్యమున గుణాతిశయము ప్రదర్శించినాడని బాధనొందుచు తాము పైవాక్యములు చెప్పి పారజనితకర వ్యథనొందెదరు. కొంతకాలమైన పిమ్మట పైవాక్యముల పరిశీలించి చూడగ శ్లోకముల మార్పు కల్పించిరని.

యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా దుర్యోధనచికీర్షితం
ద్రౌపద్యాస్సమ్మతం దూతం ప్రాహిణోద్భరతర్షభః 1

ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా
సభా మాగమ్య పాంచాలీ శ్వశురస్యాగ్రతోఽభవత్. 2

సగత్వా త్వరితం దూతః కృష్ణాయా భవనం నృప
న్యవేదయస్మతం ధీమాన్ ధర్మరాజస్య నిశ్చితమ్. 3

పైని ధర్మరాజుచే బంపబడినదూత ద్రౌపదికి ధర్మరాజు అభిప్రాయమును తెలుపకుండగనే ఆమె సభకు వచ్చినట్లున్నది. సందర్భరాహిత్యము స్పష్టముగ గన్పట్టుచున్నది. ముద్రాపకు లీవిషయమును గమనించనేలేదు. అన్నిప్రతులలోను నిట్లే కలదు. ఈశ్లోకము లిట్లు మార్పునొందిన దోషము తొలగ గలదు.

యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా దుర్యోధనచికీర్షితం
ద్రౌపద్యాస్సమ్మతం దూతం ప్రాహిణోద్భరతర్షభః॥ 1

సగత్వా త్వరితం దూతః కృష్ణాయా భవనం నృప
న్యవేదయ న్మతం ధీమా న్ధర్మరాజస్య నిశ్చితం॥ 2

ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా
సభా మాగమ్య పాంచాలీ శ్వశురస్యా గ్రతో భవత్. 3

మూడవ శ్లోకము రెండవ శ్లోకముగ మారవలెను. చూడుడు పాఠకులు. శ్రీ వారణాసివారి ఘట్టమును ఖండించుట కధోనీవీత్యాది శబ్దవిచారముపై నెక్కువ దృష్టి నిలిపి శ్రమనొందిరి. పై పాఠభేదము నెరిగించిన నొక్కమాటతో బోవునుకదా? ఇట్టిదే పాఠౌచిత్యవిమర్శమని పండితులకు మనవి. కొందఱు వ్యాఖ్యాతలు ప్రక్షిప్తములని వదలినభాగములను కొందరు వ్యాఖ్యానించిరి. ఇట్టివనేకములు భారతమున గలవు. కుంభకోణముప్రతినున్న వైష్ణవధర్మపర్వభాగమే ప్రతియు నెఱుగదు. కవిత్రయమెరుగదు. భారతము మొదట అరువది లక్షల శ్లోకములదట. అందు దేవలోకమున ముప్పదిలక్షలును పితృలోకమున పదునైదులక్షలును గంధర్వలోకమున పదునాలుగు లక్షలు నుంచబడెనట. మనుజలోకమున భారతకథ తగ్గించబడినదా? భారవత్వాత్ - భారతమనిన నేలోకమున నెంతయున్నను పేచీలేదు కాని భరతవంశప్రధాన మితరలోకము వాంఛించునది కానేరదు. కధనములో భరతునికి పూర్వము భారతరచనమనిలేదు. దేవలోకనిక్షిప్తమెట్లు? భారతరచనకాలముకూడ వ్యతిరేకించును. కావున నిది యుక్తిశూన్యమే. మనుష్యలోకసంఖ్య ఇతరలోకముకన్న హెచ్చుదయినను వారికన్న సంఖ్యను తగ్గించి గ్రంథ మొసగి

పక్షపాతమును జూపించికొనినాడు వ్యాసుడు. లక్ష శ్లోకసంఖ్య వ్యాపించినపిమ్మట పై పంపకము జరిగినట్లున్నది. 1+14=15-30+30-60. ఈవిభాగమును బాగుగతఱచి అన్వయించుకొనిన నీవిషయము గ్రహింపగలరు పాఠకులు. భారత మరువదిలక్షలే చేసినాడనుట కుపపత్తి యెటనున్నది? ఎన్నిలక్షలయినను పంపిణీ అట్లేచేయ ననువగును. వేలయినను నట్లే పంచవలెను. భారత మిరువదినాలుగువేలనుకొందము. సంఖ్య యిట్లగును. మూడులక్షల ముప్పది ఆరువేలు గంధర్వలోకమునను, మూడులక్షల ముప్పదిఆరువేలు పితృలోకమునను యేడులక్షల ఇరువదివేలు దేవలోకమునను నిలుపబడును. 8800 మనుజ లోకమున నున్నచో 123200—132200—264400 × పంచబడును. ఈరెండు పద్ధతులును లోకములో వ్యాప్తినొందినవే. రామాయణము నిట్లే సద్దుబాటు చేసినాడు బ్రహ్మ. నూఱు కోట్ల సంఖ్యగల రామచరితలో సగము దేవలోకమునకును పదికోట్లు గంధర్వలోకమునకును మిగిలినవారికి తక్కినదాని నొసగి (సరిఅయినలెఖ్ఖలేదు) మనుజలోకమున కిరువదినాలుగు వేల శ్లోకముల నిచ్చెను. రామకథలో నేభాగము లోపించినదో కదా? గాయత్రీసమ్మేళన మొనర్చి లాభమునుకల్పించినానని మనుజలోకమును మురిపించి తనకితరలోకము లందుగల ప్రేమను బయలుపెట్టుకున్నాడు ఛాందసుడగు బ్రహ్మ. ఈపద్ధతినే భారతమునకు జరిగించి తనవ్యాసతను (విభజించువాడు) వెల్లడించుకొనినాడు. కృష్ణద్వైపాయనుడు.

భారతమును పలువురు పండితులు విమర్శించి గ్రంథములను వ్రాసియున్నారు. నేడు పూనాలో ప్రకటింపబడుచుండిన మహాభారతము ప్రక్షిప్తములను వదలి ముద్రింపబడుచున్నట్లు చెప్పబడుచున్నది. ముగిసినపిమ్మట గాని వారి పరిశోధనాఫలితము న్యాయముగా లోకము నాక్రమింపజాలదు. పలువురు పండితులవలన విమర్శింపబడుచుండుట వలననది గ్రాహ్యమగుట ధర్మము. భారతముద్రణమును గురించియు వ్యాఖ్యలను గురించియు కర్ణోత్పత్తిలో విశేషముగ వ్రాసియుంటిని. వ్యాఖ్యలలో కొన్ని పూర్తిగను కొన్ని భాగములుగను నశించినవి.

## నీలకంఠ నిందయా?

నీలకంఠునితండ్రి గోవిందదీక్షితులు. సూరియనుపిలుపు కలదు. తల్లి పుల్లాంబిక. చతుర్ధర (చౌధరి) వంశమువాడు. మహారాష్ట్రబ్రాహ్మణుడు. గౌతమగోత్రము. కుమారుడు గోవిందదీక్షితులు. పౌత్రుడు జపవిధి, ధర్మతత్త్వప్రకాశము నమస్కారవిధి, షణ్ణవతిశ్రాద్ధనిర్ణయకర్త యగు శివరామ దీక్షితులు. ప్రపౌత్రుడు 1746 లో కూర్పరగ్రామమును సన్నదుపై గొనిన గంగారామదీక్షితులు. ఆంధ్రమహారాష్ట్రసాహచర్యము నీతని తల్లిపేరు (పుల్లమ్మ) తెలుపుచున్నది. నీలకంఠుని వేదాంతగురువు సారస్వతాద్వైతసుధానామక రఘువంశవ్యాఖ్యాతయగు లక్ష్మణార్యుడు. 1663 ప్రాంతమువాడు.

శ్లో॥ బాహ్యాస్తేనాభిభాష్య బహిరుదవసితం పాతితరోగ్రప్రతిష్ఠా
మీమాంసాప్రాతిహార్యంభజత గుణగణం యస్యసాంఖ్యాతి
సాంఖ్యాః
వ్యాఖ్యాతే యోగసిద్ధే సహిత ముపనిషద్వ్యాహబృందైః
పరంమే
భాగ్యం శ్రీలక్ష్మణాఖ్యే జగతి విజయతే యస్యలేశాః
శివాద్యాః॥

శ్లో॥ ఉత్తానేష్వేహ కోశవిగ్రహబలం పద్యేషు నైవాశ్రితం
గంభీరేషు నసేతవో నవిహితా కూటాననస్ఫోటితాః
నచ్ఛిన్నా నతమశ్చరా నసతతి ర్భక్తా ననాస్ఫోటితాః
నోసేనా నవిభీషణాశ్చ నిహితాశ్శ్రీలక్ష్మణార్యాశ్రితైః॥

గురువునందలి గౌరవము నీశ్లోకములు చెప్పుచున్నవి. ఈ లక్ష్మణుడు బ్రహ్మజ్ఞాని కుటుంబమువాడు. కౌండిన్య గోత్రము. దత్త, గోజాంబికల పుత్రుడు. ఉత్తమశ్లోకమహా మునికి వేదాంతశిష్యుడు. తండ్రినుండి వేదమును నీలకంఠ శుక్ల కలంకారశాస్త్రగురువగు భట్టమండనునుండి తర్కమును నేర్చెను. కాశీనివాసి. గణేశనారాయణుల భాగినేయుడు. గణేశ రఘు నాథుల తమ్ముడు. నీలకంఠరచితగ్రంథము లివి. మంత్ర కాశీఖండ టీకా, మంత్రభాగవత వ్యాఖ్య, మహాభారతభావదీపిక, వేదాంత కతక, శివతాండవ వ్యాఖ్య, షట్తంత్రీసార, హరివంశటీకా, గణేశ గీతా టీకా, సౌరపౌరాణిక సమర్థనం, రుద్రసారసంగ్రహవ్యాఖ్య

(రుద్రమీమాంస) విధురాధానవిచారము. ఈతడిట్టి పండితు డని యెరుగకయే నిందించితి ననిహారుకథకులు. ఆతని నట్లు నిందించి నేనుపొందులాభమేమి? నీలకంఠుడు నిన్న శ్రేయస్సు పాలొనరించునని బెదరించిరి శాస్త్రిగారు. ఈబెదరింపు విమర్శ నాపదు. "ప్రమాదోఽధీమతామపి, అప్యేవార్థే" అను నదియే నాఅభిప్రాయము కాని నిందాపారీణత్వసంపాదనేచ్ఛ కాదని పండితులకు మనవి. శంకరుని భాష్యములో దోసగు లున్నవని యీ నీలకంఠుడు భాష్యమును దడవుట! కాళిదాసు పండితుడు కాకయే ఆతని ప్రయోగములాక్షేపింప బడినవా? అమరుడు పండితుడని యెరిగియు ఖండనఖద్యాది ముండన ముల వ్రాసినవారి నేమంటిమి? మహేశ్వరు నాక్షేపించిన మేదినీకరుడు నీలకంఠునికి బ్రామాణికుడు? భవభూతి "తాన్ప్రతినైష యత్నః" అనుకొను టెందులకు? "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే." వాక్యమునకు బ్రతిగ "మురారిపదచింతయాం భవభూతేస్తు కా కథాపుట్టనేల! కుమారిలభట్ట భాగినేయుడు తార్కికచక్రవర్తి ధర్మకీర్తివంటి మహాకవి.

శైలై ర్బంధయతిస్మ వానరహృతై ర్వాల్మీకి రంభోనిధిం। వ్యాసః పార్థశరైః తథాపి నతయో రత్యుక్తి రుద్భావ్యతే। వాగర్థాచతులాధృతా విహతథా ప్యస్మన్మహాప్రబంధానయం। లోకో దూషయితుం ప్రసారితముఖ స్తుభ్యం ప్రతిష్ఠేనమః॥ వాల్మీకి వానరులవలన పర్వతములచే సేతుబంధము

చేయించుటయు, వ్యాసుడు పార్థేతరములచే సముద్రము సంకింప చేయుటయు, సత్యోక్తిగా యున్నను సూక్తిగా గ్రహించుచున్న లోకము వాగర్థముల ప్రాపున సమాసముగ చూచి వాడుచున్న నా ప్రబంధముల దూషించుచున్నది. అట్టి ప్రతిష్ఠారూపమా? సమస్కార మనినాడు. దీనినిజూచిన నాకాలమున లోకమీతని నిందించుట తోచుచుండలేదా! వాల్మీకి వ్యాసుల యందీతడత్యుక్తిని, చమత్కారముగ నాలోకింపలేదా? క్షేమేంద్రకవి కౌచిత్యవిచారచర్చలో నెందరకవుల విమర్శించెను? మచ్చున కొకటి.

వృద్ధాస్తే నవిచారణీయచరితాః తిష్ఠంతు హుం వర్త
తాం। సుందస్త్రీదమనే ప్యఖండయశసో లోకే మహాంతో
హి తే। యాని త్రీణ్యకుతోముఖాన్యపి పదా న్యాస న్ఖరాయో
ధనే। యద్వా కౌశల మింద్రసూనుదమనే తత్రాప్యభిజ్ఞో జనః॥

అత్ర అప్రధానస్య రామసూనోః కుమారలవస్య పరప్రతాపోత్కర్షా సహిష్ణోర్వీరరసోద్దీపనాయ సకల ప్రబంధజీవిత సర్వస్వభూతస్య ప్రధాననాయకగతస్య వీరరసస్య తాటకాదమన ఖరదూషణాపసరణ అన్యరణసంసక్తవాలివ్యాపాదనాది జనవిహితాపవాదప్రతిపాదనేన స్వవచసా కవినా వినాశం కృతః. ఇత్యనుచితమేతత్॥ ఇట్టివనేకములు కలవు. పలువురు పండితులు కవులు గ్రంథముల వ్యాఖ్యల, విమర్శనముల, విమర్శ సేయుచునే, వచ్చిరి. స్పర్ధయా వర్ధతే విద్యా,

వాక్యము జిజ్ఞాసువుల కుపకరించునవిగ, బరిణమించలేదా? తాను వ్రాసినది సరిగ జూచు కొనక యితరులచే వ్రాయ బడినదానిని, సరిగ, గమనింపక ఎన్నటికయిన, నుపయోగింప గల చొప్పదంటువ్రాతల వ్రాయక, మేకులబిగింపు ప్రయోజనము మాత్రమే కల జీలుగుబెండ్లవంటి నిస్సారపువ్రాతల వ్రాయజొచ్చినవారు తప్ప, నిదానముగ, యుక్తియుక్తముగ వ్రాయు బుద్ధిమంతులు నేడు లేరా? వారంవరు పండితబ్రువులే యని యెంచు పండితుల నేమనవలెను? డాంబికపువ్రాతల వ్రాసినవారిని మందలించుటకు పండితులు పూనుకొని నిజమును బయటపెట్టుటకు జంకుచున్నారు. అడుసుద్రొక్కుటకు జడియుచుందురు కానోపు. అందువనే తప్పుడువ్రాతలు బలియుచున్నవి.

ఉచితంప్రాహురాచార్యాః సదృశంకిలయస్యతత్,
ఉచితస్యచయోభావః తదౌచిత్యంప్రచక్ష్యతే॥

నాశాస్త్రగునుచితత్వముతో, సంబంధములేని, కల్పించుకొనదగని శాస్త్రిగారు, నిరంతరోచితప్రవక్తగ, నన్నెంచుట తగియే యున్నది. నీలకంఠవ్యాఖ్యాగత విషయముల ముందింకను, జర్చింప, వలసియున్నది. కావున శాస్త్రిగారి పరిశిష్టవిషయము నెత్తుచున్నాను. బాలా, కన్యా, శబ్ద సమీక్షలో, వీరు చూపినామనిన ప్రయోగాధారములు క్రొత్తవేమియుకావు. కన్యాశబ్దవిచారమీవిభాగములో చేసెద మను

కొనిరి కాబోలు! మరచిరేమో! ఎక్కడబాలయున్నను, గౌణ, యనుకొనుటయే, వారిపని. కౌముదిలో, కన్యాయాః కనీనచ, బాలమనోరమలో భారతేవ్యాసః కర్ణశ్చ, కన్యాయాఃపుత్రౌ ఇతిప్రసిద్ధమ్. అనియు, కలదనిరి. గౌణముకూడ ముఖ్యముగ మారునవకాశము కలదని నేను కర్ణోత్పత్తిలో వ్రాసిన వాక్యములను ఖండించునవకాశము చాలమి నాకాశ పంచాగమును విప్పిరి. వ్యాసశబ్దము గౌణముకదా! రూఢి ముఖ్యములోనికి దింపినది. వృద్ధవ్యాస, బాలవ్యాస, శబ్దము లలోని, వృద్ధబాలశబ్దములు గౌణములు. బాలుడు వృద్ధుడు (యోగరూఢము) కాకుండునా? వృద్ధునశించకుండునా? కైయ్యట, కౌముదీ, బాలమనోరమలు వ్యాసత్వము మాత్రము ముఖ్యముగ బరిణమించుటను దెలుపుచున్నవి. శాస్త్రిగారి కర్ణోత్పత్తిసమీక్ష (11–12 పేజీలు). ఎఱ్ఱాప్రగడ కనువాద కర్తృత్వమున ద్విరసనాత్వము సిద్ధింపజేసినది ప్రకృతదృష్టాం ధ్రారణ్యపర్వము. అట్లుండుట తగియుండలేదని నావాదము. కాలపుమార్పున నీపృథక్కరణము సిద్ధించినదను నాసంశ యము నెఱ్ఱాప్రగడ తీర్చలేదు. శాస్త్రిగారికి బసిబిడ్డ పిన్న, పసిపాపల, వినియోగమునవిచ్చినవాడు, కావున శాస్త్రిగారే వానప్రస్థులై (అరణ్యపర్వము) నీలకంఠుని సేవించి ఎఱ్ఱాప్రగడకు బృథక్త్వము నుజ్జగింపజేసి సంయో జన మొనరింపగలరని యెంచుచున్నాను. కొన్నిపుటలు దీనిని గురించి నింపిన వారివ్రాతలో కన్యనుగురించి యేమనెనో

పూర్తిగా జర్చించలేము. అక్షుతయోనిత్వ మాతము నిర్దేశించిన దని కొధకులు. కామయతే, సర్వాన్ । కన్యా అనినాము నీల కంఠుడు వనపర్వవ్యాఖ్యలో. "కామం"బులెల్లను గామించి పొందుట నయ్యో గన్యాశబ్ద, మనినాడు యెఱ్ఱాప్రగడ. "సర్వాన్కామయతే యస్మాత్కనధాతోశ్చ భామిని । తస్మాత్కన్యేహ సుశ్రోణీ స్వతంత్రా వరవర్ణినీ । కనధాతూత్పత్తి కలది కన్య. ఆమె కాంతి యందరను కామింపచేయునదని అర్థము. అందువలననే పురుషుల నందఱను యౌవనప్రాదుర్భావమున గామించునదై యున్నది. 21—5—55 పత్రములో శాస్త్రిగారు "వయసిప్రథమే, సూత్రమును, జర్చించుచు "వయసి ప్రథమే 4=1—20 ప్రథమవయోవాచినో అదన్తాత్ – స్త్రియాంఙీప్ స్యాత్-కుమారీ" చాలావ్రాసిరి. ఇదిపై బాలాశబ్దవిచారమువంటిదే. బాలాశబ్దము వయసిప్రథమే వలన ఙీవ్ వచ్చినదికాగా అజాద్యతష్టాప్ అనుసూత్రముచే అజాది గణపఠితమగుచున్నందున టాప్ విధింపబడి ఙీవ్ రాలేదు. 'వయస్యచరమే, వార్తికముకూడ జూతము, వధూటీ, చిరంటీ యౌవనవాచినో. అతఃకిం, శిశుః కన్యాయాః, న, కన్యాయాః, కనీనచ ఇతినిషేధాత్.

కౌముదిలో కానీనశబ్ద పర్యాలోచనము 2—1—66 లో యువాఖలతి పలిత, వలిన జరతీభ్యః అనుచు 2—1—67 లో యువత్యామేవ జరతీధర్మోపలమ్భాన త్ద్రూపారోపాత్ అని యున్నది. యువకుడు ముసలి యగునని యే పాణిని అభి

ప్రాయము కదా. రూపమును మార్పునొందించు కొనెదరేమో శాస్త్రిగారు. కనీనచ సూత్రముచేతనే కన్య, శిశువు కాదని, అర్థము స్పష్టమగుచున్నది కాదా! రెండవ సూత్రములో గూడ కనీనచ కన్యాశబ్దము లుండుటచే శాస్త్రిగారుదహరించ వలసియు ప్రతారింపజేసిరి. వ్యాకర్తలు కదా వారు! వయసులు రెండేకలవు వ్యాకరణములో ప్రథమచరమములు.

ఆద్యేవయసి నాధీతం ద్వితీయేనార్జితం ధనం।
తృతీయే న తపస్తప్తం చతుర్థే కింకరిష్యసి॥

ఈవయస్సులు నాలుగు. చూడండి. శాస్త్రిగారిచ్చిన వయస్సులు మూడు. పితారక్షతి, కౌమారే భర్తా రక్షతి యౌవనే: వార్ధక్యే.

బాలా, కుమారీ, కన్యాశబ్దములు వేలాదిగ నున్నవి. వీటిని వ్యాకరణరీత్యా సాధించుకొనుచు వచ్చినచో జీవిత కాలములే చాలవుకదా. కామయతే సర్వాన్ కన్యా యనగ నక్షతయోని యర్థమా! కన్యతే-కామ్యతే-అమరము-కన్యా నిర్వచనమొకతీరు అక్షతయోనిత్వమొకతీరు. ఇట్టి భేదముల జూచియే నేను నీలకంఠవ్యాఖ్యాదులని వ్రాసితిని. కౌముదీ, బాలమనోరమ, లలో వ్రాసినది కన్యకాదని నేననలేదే. వాని లో బుత్రులు చెప్పబడలేదనినారు. కుంతిభోజుని పుత్రిక, కన్య కాదనుచున్నారు-అసత్యము కన్యకు మాత్రమే అనువిరోధము

రాకుండుటకు గాసినత్వము చెల్లునని వివరణమిచ్చిరి. పరిశిష్టము 2 పుట. చివరిపేరాగ్రాత. డొంకతిరుగుడు. అపత్యము స్త్రీలకు మాత్రమేనా ! ఇంద్రస్య అపత్యం పుమాన్ ఐంద్రిః పరాశరస్య అపత్యం పుమాన్ పారాశర్యః వృష్ణేః అపత్యం స్త్రీ వార్ష్ణేయీ. ద్రుపదస్య అపత్యం స్త్రీ ద్రౌపదీ. ఇట్టివాని మాటేమిటి? సుతోత్పత్త్యనంతరము మునివరమహాత్మ్యమువలన కన్యకలయినవారు కుంతీసత్యవతులు మాత్రమేనా ? యయాతికుమార్తె గాలవుని దత్తపుత్రిక మాధవి. "ప్రసూత్యంతే ప్రసూత్యంతే కన్యాచైవ భవిష్యసి" సంతానముకలిగినపిమ్మట బ్రాహ్మణవర ప్రభావమున కన్యఅగుచునే నలుగురు పుత్రుల గనినది. (ఉద్యోగ॥ 114 అ) "ఇయం సురసుతప్రఖ్యా సర్వధర్మోపచాయినీ । సదా దేవ మనుష్యాణాం అమరాణాంచ గాలవ" కాంక్షితారూపతో బాలా (సర్వాన్కామయతే) సుతామే ప్రతిగృహ్యాతాం (కామ్యతేసర్వాన్కన్యా) ప్రతిగృహ్యాచతాం కన్యాం గాలవ స్సహ పక్షిణా "పునర్దీక్ష్యైవ ఇత్యుక్త్వా ప్రతస్థే సహ కన్యయా ! మమదత్తోవరః కశ్చిత్కేనచి ద్బ్రహ్మవాదినా ప్రసూత్యంతే ప్రసూత్యంతే కన్యాచైవ భవిష్యసి" మాధవీచ పునర్దీప్తాం పరిత్యజ్య నృపశ్రియం । కుమారీ కామతో భూత్వా గాలవంపృష్ఠతోన్వగాత్ ॥" కుంతి సత్యవతివలె నొకసంతానముతో నాగినదికాదు. పై మాధవివంటిది. విద్యారణ్యభాష్యము — "కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి తన్నోదుర్గిః ప్రచోదయాత్" నారాయణీయవ్యాఖ్య

ఆదిశక్తిం ప్రార్థయతే. అహా కన్యాచాహా (ప్రాక్ పరిణయాత్) కుమారీచేతి, కన్యకు వివాహముకాని స్త్రీ యని అర్థమును, భాష్యకారుడు, వ్రాయుచున్నాడు. ఉదయనాచార్యుడు. న్యాయకుసుమాంజలిలో "గర్భాయివశివకుమార్యాః విధిరేవ పుంయోగ మనుమాపయతి" వేదకుమారికి విధియే కుమారికి గర్భమువలె పుంయోగ మున్నదని ధృవపరచెను. కన్యా, కుమారీ. వివాహముకాని పడుచుపేర్లని అమరుడనినాడు. పడుచు అనుటసామాన్యస్త్రీ వాచకముగనే. శాస్త్రిగారు గుణవచనాః లింగవ్యత్యయ స్సర్వతశ్ఛాందసః అనక గుణరాహితిని గల్పించుకొనెదరోటు!

## కానీనశబ్ద పర్యాలోచనము

ముని, దేవతామాహాత్మ్యాత్, యా పుంయోగే ప్యక్షతయోనిర్భవతి. యథా కుంతీ మంత్రాహూతదినకరోత్పాదితకర్ణాఖ్యపుత్రాపి పునః కన్యైవాభూత్ - తదపత్యమ్ కానీనాభిధేయమ్. మహాభాష్యప్రదీపము. దీనికి కథకుల వివరణమిది "పరాశరముని మహిమవలన వ్యాసోత్పత్త్యనంతరము కన్యాత్వోచ్ఛిత్తి లేనట్టి సత్యవతీదేవియొక్కయు సూర్యదేవమహిమవలన కర్ణోత్పత్త్యనంతరము కన్యాత్వోచ్ఛిత్తి లేనట్టి కుంతీదేవియొక్కయు సుతులు కానీనశబ్దముచేత చెప్పబడుదురు. అని. ఈవివరణము

లోని ప్రథమభాగమునకు మూలమేది? ముని దుర్వాసు డేల కాకుండును? సూర్యుడు తద్వరపోషకుడు కావచ్చును. కాని పరాశరుడెట్లగును? మునులయొక్కయు దేవతల యొక్కయు మహాత్మ్యమువలన యేకన్యఅయినను పురుషు నితో గలిసినచో (అనంతరము) అక్షతయోని కాగలదు. ఇది లోకసామాన్యవిషయము. మంత్రమహిమవలన వశుడైన సూర్యునిచే బుట్టింపబడిన కర్ణుడను కొడుకుగలిగియు కుంతి యెట్లు కన్య ఆయెనో? అట్లు. అని పూర్వమున కన్యయను కదా. ఆసంతానము కానీనుడు కదా? ఇట్టిలోకసామాన్యవచ నమువలన నట్లు కనినవారున్నచో వారినేమనవలెను? మాధవీ సంతానము నల్గురును కానీనులు కారా? "కానీనగర్భః పితృ కన్యకాయాంతస్మా దృషే స్త్వం భవితాచ పుత్రః (పితృకన్య యననేమో) తానెరుగని మాధవీసంతానమును ప్రదీపము చెప్పలేదు. అనుకోవలెనా? కన్యయందుబుట్టినయాతడు కానీ నుడుకదా? కన్యయందుబుట్టినది స్త్రీయైనచో కన్యకాజాతా కానీనాయగునుకదా? వ్యాసకర్ణులను దప్ప మరి యిట్టి వారిని పాణిన్యాదు లెరుంగకుండ వచ్చును. శాలివాహనుడు కన్యా జాతుడట! ఈకానీనశబ్దమాతనికి వ్యాకరణవ్యాఖ్యాతల యనంతరము వాడగుటచే యోగరూఢి కాకుండునా? ఆతనిని బండితు లేమని చిత్రించెదరో "పితృగృహే కన్యాయాః పుత్రః అప్రకాశం జనయేత్, తం కన్యాపరిణేతుః పుత్రనామ్నా కానీనం వదేత్" గృహేప్రచ్ఛన్న ఉత్పన్నః గూఢజస్తు సుత

స్స్మృతః। కానీనః కన్యకాజాతః మాతామహసుతో మతః।
క్షతాయామక్షతాయాం వా జాతః పౌనర్భవః స్మృతః॥ అగ్ని
103 అ 15 శ్లో. వ్యాసుడు కానీనుడను సూక్తిని వీరంగీకరించి
యున్నారుకదా! వృద్ధవ్యాసేత్యాది విశేషణయుత వ్యాసు
లను వృద్ధకాపీనేత్యాదుల ప్రయోగించి వాడుటనువీరొప్పుకొనె
దరా? శాస్త్రిగారొకచో నుదహరించిన 'కానీనస్యముచేః, శ్లోక
మున కానీనశబ్దము సూక్తియగుట గమనార్హము. వీరి
కానీనశబ్దవిచారములో చివర, ప్రథమవయసుకలది కన్యయని
చెప్పినామనిరి. దాని వివరించి యిదివరకే వ్రాసియున్నాను.
బాలకర్థము చంటిదికాదని నేననగ అప్రసక్తిని దెచ్చినవారెవ
రని ప్రశ్నించుచున్నారు బాలవ్యాసులు. అప్రతిషక్త ప్రతి
షేధదోషమంటు ననిరి. దోషాన్వేషులగు వీరు కుంతి పసి
బిడ్డయని కథనమూరవభాగములో వ్రాసిరనిచూపించియుంటిని.
అప్రసక్తమేమి! కుంతీబాల్యము కథకులకు బసక్తమై కథనము
లన్నిటను చూపించియుండియు లేదనెదరేల? కన్యాబాలాశబ్ద
ములు సామాన్యస్త్రీవాచకములుగ నుండుననుటలో వీరికి గలి
గిన విప్రతిపత్తి యేమిటో? ఈరెండుశబ్దములు మాత్రమేకాక
భామినీ, సతీత్యాదులు చాలాకలవు. బాలాశబ్ద మొకచోటనే
కలిసియున్నవానిని చూపించుచున్నాను. 'బాలాంపుంయోగ
మనిచ్ఛంతీం బాలామివ' నీలకంఠుడు ఇవశబ్దమిట నర్థభేద
మొందించినది. ఇట్లే కన్యాబాలాశబ్దము లనేకస్థలముల బ్రయో
గింపబడవచ్చును. ఇట్టిచోటులనెల్ల గౌణవిచారణ కూడదు.

4

సుఖవివర్ధితబాల ఏర్పడిన బాంధవాటోపనర్చినను హృదయమున నుంచుకొనవలదు. తగదు. అనినాడు కుంతిభోజుడు. శంద్రిహృదయమును తూచినట్లున్న దీమాట. బాలేనాపిసతా మోహాద్భృశం పాపకృతాన్యపి । నాభ్యాసాదయితవ్యాని తేజాంసిచతపాంసిచ॥

## పాఠాంతరములు

బాలేనాపి సతా మోహాద్భృశం సాపహ్నవాన్యపి
నాత్యాసాదయితవ్యాని తేజాంసిచ తపాంసిచ 1
బాల్యేనాపి సదా మోహాత్. 2
............ సతాంపాపకృతాన్యపి 3
............ భృశం శాపభయాదపి 4
............ భృశం కోప ప్రదవాన్యపి 5
నాన్యాసాదయితవ్యాని ............ 6
తాన్యాసాదయితవ్యాని ............ 7

నీలకంఠునిపాఠము తిక్కనకతో గూడినది. ఆతని సతా-నాఘునా = తప్పర్థము. "బాలేనాపి సతా తేన కృతం నాహ్యాం జనార్దన, ద్రోణ - 184 అ. ఇట చిన్నవాడైనను అనియేకాదా అర్థము? కృఞ్ ధాతువును దెచ్చుకొని హింసార్థమతనిచే చెప్పబడినది. అన్వయము సుగమముగలేదు. సతా, సతీ, సతౌ, సచ్ఛబ్ద మన్ని విభక్తులకును జేరగలదు.

తేజస స్తపస శ్చైవ నిత్యంబిభ్యే యుధిష్ఠిర । ఉభే హ్యేతే పరిత్యాజ్యే తేజశ్చైవతప స్తథా" అను - 9 అ. 21 శ్లో - "త్రయాణాం ప్రతపతాం తేజసాచ బలేనచ । బ్రాహ్మణేష్వేవ శామ్యంతి తేజాంసిచ తపాంసిచ. అను 61 అ. 36 శ్లో. సామాన్య వాచకమగు దీనిని కుంతీచరిత్రకు గలిపి శాస్త్రిగారి నాందో ళింపజేసినారు నీలకంఠుడు. పై పాఠములలో నీక్రిందిపాఠము సరసముగ గన్పడుచున్నది. "బాలేనాపిసతా మోహాద్భృశం సాపహ్నవాన్యపి । నాత్యాసాదయితవ్యాని తేజాంసిచ తపాంసిచ" కొన్ని పాఠముల నెరిగినను దనకిష్టమయిన పాఠమును నీలకంఠుడు గ్రహించియుండనోపును. అంతరిత ములై యున్నను తేజస్తపోవిశేషములు బాలునిచే నయితము సమీపించదగినవికావు. (పొందింపదగినవి) అనగానిర్లక్ష్యము చేయదగినవికావు. కుంతియీవాక్యము యౌవనోపష్టంభకము కాక పసితనమును దెల్పుచున్నదా ? అవసరము లేకున్నను వనపర్వము తనలోనిముడ్చుకొనినదీ శ్లోకమును. బాలశబ్దములు పలువిధముల జూపితిని. ఇంకను గొన్ని జూపెదను. "అజ్ఞోభవతివై బాలః పితాభవతి మంత్రదః" అజ్ఞంహి బాలమి త్యాహుః- సతు- వయః- ఇవన్నియు గౌణములు ముఖ్యము లయినవే. బాలవ్యాసులు వృద్ధవ్యాసులు కాకతప్పదుకదా ! గౌణము స్థిరముకాదనుటకు శాస్త్రిగారి వయసే తార్కా ణము. గౌణమేఅయినరూపమె మార్పు తేగలదు. శాస్త్రిగారి వాదములవంటివానినే "ఉభయప్రగల్భోచ్చారణమేవపాండిత్య

హేతుః" అని పెద్దలు నుడివెదరు. కుంతి తండ్రి కుంతి భోజుడు ఆలింగనమును చేసినందున కుంతిబాల్యము ద్యోతిత మైనదనుచున్నారు కథకులు. ఆశ్లోకములోని 'సమర్థ్యచ' కేమి చెప్పగలరో? యౌవనమందున్న పుత్రిక తండ్రికూడ ఆలింగనమును జేసికొనకూడదను మనువు వచనమిచ్చిరి. స్కాంద పురాణము.

భావశుద్ధిః పరంశౌచం ప్రమాణం సర్వకర్మసు
అన్యథాలింగ్యతే కాంతా భావేన దుహితాన్యథా
అన్యథైవ స్తనం పుత్రశ్చింతయత్యన్యథాపతిః
చిత్తం విశోధయేత్తస్మాత్కిమన్యై ర్బాహ్యసాధనైః॥

ఈభావమే యోగవాసిష్ఠము "మనశ్శుద్ధి" శ్లోకములో గలదు. శాకుంతలములో గణ్వుడు శకుంతల నాలింగన మొనర్చుకొనుట నేమందుము. శాస్త్రిగారు పౌరాణికులు గదా? పురాణవాక్యమును వదలుకొనెదరా? స్మృతిగ్రాహులు య్యెదరా? పై ఆలింగనమును సరిగనడపెదరా? శాస్త్రిగారి వ్రాత తు పాఖననమే? లోకమర్యాద నొప్పుకొనిన నేను కుంతి సూర్యుని స్పర్శింపనిచ్చినదని వ్రాయుట హేయ మనిరి. అంగీకరించుటయే స్పర్శింపనిచ్చుటకు దావిచ్చినదిగ వ్రాయుట పేయమే కాని హేయము కానేరదు. విహ్వల-మూఢచేతనా శబ్దములకు మైనుర పర్థముకాని-చో వీరనినదే వేదవాక్యము. తిగ్మాంశుశ్లోకవివరణములో సామ్యసిలజేసి

కర్తవ్యమాచరించెను. అని వీరు వ్రాసినదాని కేదిఅర్థము కాదేమి? కన్యాత్వస్థాపనను జేసిన వాడు తానేఅయిన సూర్యుడు కుంతిని దూషితగ నెట్లనును? పనితీరినపిమ్మట దూషణ మెందు లకుచేయునని వీరు ప్రశ్నించినవియే — "నదూషయామాస భానుః" ఈదూషణ మూలలదికాదు. చేతలది. వీరుగ్రహించ లేదు. మోహావిష్టా, మోహావేశ మెఱంగిని శాస్త్రిగారుస్పృశించు పుడు బూర్వమే కుంతి మంచము పైబడుట, సూర్యుడు కర్తవ్య మాచరించుట యెట్లు వ్రాసిరి? వారు కలిసిన, కలయిక, స్పర్శకు పిమ్మటకదా చెప్పిరి? నీలకంఠుని ప్రస్థితం సంగమాయోపా క్రాన్తస్థితిని శాస్త్రిగారు చూడనేలేదేమో! శాస్త్రిగారు కలిసినది, కర్తవ్య మాచరించినది, సంగమము కాదేమో? శాస్త్రిగారి "తిగ్మాంశు" శ్లోకములో "యోగేనకు" కలయి కయే అర్థము. నీలకంఠుడు సూర్య — కుంతీసంగమమును బాహ్యవ్యాపారముగ జెప్పగ నేనట్లనుట తప్పా? ఆత్మసంస్థాం చకారను మార్చి దూషయామాస భానుః (పరి 25 పే 15 పంక్తి) అని అన్వయిమును గల్పించుట తగును కాబోలు? నచైవ అనుమూలగతపదమును దూరాన్వయమునకులాగుట వాక్యాండీర్యలక్షణమా? నా వాదమును గ్రహింపనేరక పరాస్త మయినదనుట సాహసము. కుంతిది యౌవనము కాదను వారివాదము దౌర్బల్యమయినదని ఘూర్తిగరుజువగు చునే యున్నది.

## వ్యాకరణపారీణాపమార్గణము 1

### 1 కుంతీ వయోవిచారము

గురోర్గిరః పంచదినా న్యధీత్య
వేదాంతశాస్త్రాణి దినత్రయంచ
అమీ సమాఘ్రాయచ తర్కవాదాన్
సమాగతాః కుక్కుటమిశ్రపాదాః

అచ్చుపొరబాటును ప్రధానముగ జేసికొని "యధేచ్ఛ" అని నేనువ్రాసితిననిరి. "యదృచ్ఛయా" ఆరుసారులు ముద్రితమైనది 'యధేచ్ఛ' రెండుసారులు ముద్రితమైనది. ఉదహరించిన భాగవతశ్లోకమునైనను జూచుకొనరైరి శాస్త్రిగారు. ఇతరులందరబాటు, దుడుకుతనము. ఈవ్రాతయె తెలుపుచున్నది. సంభవిత, ఋతుచిహ్న, శబ్దముల అన్వయమును దాముకుదుర్చుకొనలేక సాధుత్వమెట్లని నన్నడుగుచున్నారు. తటాలున రచోదర్శనమైనదను తమవ్రాతయే తమ అన్వయక్రమమును దెలుపును. కుంతిరజస్వల అను విషయమును, సత్యవతి స్త్రీభావభూషితా, భావమును, చర్చించిన గ్రంథమమితముగ బెరుగును. ఇప్పటికే అన్వయపుచిక్కుపాలైన శాస్త్రిగారి విచికిత్సను వృద్ధిచేయ నిష్టపడనైతిని. కుంతీబాల్యవయోనిర్ణయమున రెండువాదములున్నట్లు వ్రాసిన శాస్త్రిగారు బాల్యమును రెండవదానిగ చెప్పిరి. పునఃపునః ప్రయోగమేకాక ఏకస్థలస్థప్రయోగముల గూడ జూపించియున్నాను. వారిప్రయోగములన్నియు నాకాశసౌధములవలె గూలుననియే. నేనుచూ

సిన బాలాశబ్దములును కన్యాశబ్దములును స్త్రీవాచకములు స్త్రీసామాన్యవాచకములు నయియున్నవి. తేజస్విని, స్వయంవరదత్తాదులు, యౌవనో పష్టంభకములయితే భామినీ, వరారోహాదిశబ్దముల నేమనవలెను? పైవానిలో స్వయంవరదత్త కూడ తేజస్విని వంటిదేనా? రతిప్రియ, సంతానవతీత్యాదుల గూడ పైవానివలె వాడెదరేమో శాస్త్రిగారు! వారునిరూపించిన విదివరకె నేను ఖండించినవి. దేశ, ప్రకృతి, వాసనా భేదములచే సిద్ధించిన ఋతుదర్శనకాలములను దెల్పుచు ధర్మాదర్శపు మొదటిశ్లోకములో యౌవనమునుబొందిన పదిసంవత్సరముల స్త్రీయే ఋతుధర్మమునొందునని చెప్పబడినది. రెండవ శ్లోకమును జూచి భ్రమసిన శాస్త్రిగారు వివరణమునట్లు వ్రాసిరి. కృత్రిమ, ఔషధసేవన, అనురాగ వాత, పిత్తములవలన ఋతుచిహ్నము కలుగునని ధర్మాదర్శపుయూహ. ఋతుస్నానమ శోణితదర్శనో పలక్షితో గర్భధారణయోగ్యః స్త్రీణామ వస్థావిశేషః. దారుణశోణితపతనమును పదియారవసంవత్సరము నకుమిగిల్చిన ధర్మాదర్శము మొదటిశ్లోకమున జెప్పిన దానికి వ్యతిరేకముగనుండే చెప్పియుండుటచే శాస్త్రిగారివివరణమునకు తావిచ్చినదనుకొనిరి. మూలమును వివరణమునొకచో జేర్చి చదివిన నిది తెలియును.

స్మృతిముక్తాఫలము 113 పేజీ=యధాహ్యాంగిరాః
రజశ్చతుర్విధం జ్ఞేయం రాగజంరోగజం తథా

ధాతుజం కాలజంచేతి యోషితాంతు బుధోత్తమైః
ఏకాదశాద్ద్వాదశాద్వా వర్షాదూర్ధ్వం భవేద్రజః
పంచాశద్వత్సరాదూర్ధ్వం స్త్రీణాం తన్నివర్తతే॥
రాగేణ యద్రజః స్త్రీణామత్యర్థంతు ప్రవర్తతే
అశుద్ధానైవ తాస్తేనయస్మాద్వైకారికంహి తత్।
ఏవం-అకాలే రాగాదిజనితరజోదర్శనేపి ద్రష్టవ్యమ్॥
అకాలే యద్భవేత్ స్త్రీణాం రక్తమహుర్మనీషిణః
కాలేతు యద్రజః ప్రోక్తం తస్మాత్తత్త్రైవ సాశుచిః॥
రిష్యంజయః=అవివాహితాతు యాకన్యా పుష్పయుక్తా భవేద్యది
చాంద్రాయణం వ్రతంకుర్యాత్ సర్వవర్ణేష్వయంవిధిః॥
స్మృతిముక్తాఫలమునందే మఱొకచో-ఏకాదశవర్షాత్ క్వచిత్

అనియున్నదికదా? దశవర్షా భవేద్గౌరీ అతఊర్ధ్వం రజస్వలా, ప్రకారము పదివత్సరములుదాటనిస్త్రీ రజస్వలఅయినచో "లోమోద్గమశ్చ రజోదర్శనాత్ప్రాగేవభవతి" అనునను భవజ్ఞాని వాక్యప్రకారము దర్శవర్షాత్పూర్వమే లోమోద్గమాదులు సిద్ధించవలెను. పదునొకండుసంవత్సరములకు పూర్వము అనగాతొమ్మిదేండ్లకే లోమోద్గమమని చెప్పినాడు కాని ఋతుత్వమును క్వాచిత్కమునకే లాగినాడు. మాధవీయ వచనము ప్రకారము దిగువవయస్సు అనగా పదికిదిగువ వయస్సు కావలసియుండగా శాస్త్రీగారు పదవవత్సర మనివ్రాయుట

యెట్లనిది ? త్రింశద్వర్షో షోడశాబ్దాం భార్యాంవిందేత నగ్నికాం। దశవర్షోష్టవర్షాం వాధర్మేసీదతి సత్వరం"ఏకవింశతివర్షోవా సప్తవర్షామవాప్నుయాత్" అని భారతమునగూడ గలదు. అతఃప్రవృత్తే రజసికన్యాం దద్యాత్పితాసకృత్। సప్తసంవత్సరా దూర్ధ్వంవివాహస్సార్వవర్ణికః। కన్యాయాశ్శస్యతే రాజన్నన్యథా ధర్మగర్హితః।వివాహస్త్వష్టవర్షాయాః కన్యాయాశ్శస్యతే బుధైః। సంవర్తః। అతఊర్ధ్వం రజస్వలాత్వాద్దేశ్చదశవర్షాదూర్ధ్వం వివాహో నిషిద్ధః. విష్ణుపురాణే 'గౌరీవాం పృ్యద్వాహేకన్యాంనీలంవావృషముత్సృజేత్' వ్యాఖ్య 'గౌరిం దదన్నాకపృష్ఠంవైకుంఠం యాతిరోహిణీం। కన్యాందదద్బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాం' ఇతిసంవర్తోక్తేః 'గౌరీందశవర్షాం కన్యాం=అష్టవర్షాభవేత్కన్యా నవవర్షాతు రోహిణీ। దశవర్షాభవేద్గౌరీఅతఊర్ధ్వం రజస్వలేతిస్మృతేః' అన్నివర్ణముల కన్యలకును గర్భాష్టమాదిదశవర్షాంతము వివాహకాలము అని నచో కన్యపనిమిదేండ్లు మొదలుపదివత్సరములవరకనుట యెట్లు? చివరది కన్యఅయినచో గౌరి8రోహిణి9కన్య10కాదా? కన్య10రోహిణి11గౌరి12ఏండ్లది కావలెను. గౌరీణాం దృష్టరజసాం, ఆదిపర్వం 221 అ 48శ్లో. 'స్మృతిసారే' రజోదర్శననిర్ణయే "దశవర్షాదధోబ్రహ్మన్కన్యావై పుష్పిణీయది। తద్వ్యాధిజమితి జ్ఞేయం నతుస్త్రీణాం స్వభావజం"ధర్మప్రవృత్తి. రాగజంరోగజంచైవ ద్రవ్యజంకాలజంతథా। స్త్రీణాంచైవం రజఃప్రోక్తం కాలజం తత్రపచ్యతే। ప్రాప్తేతుద్వాదశేవర్షే

సంస్త్రీణాం ప్రవర్తతే॥ 'కశ్యపః' వర్షద్వాదశకాదూర్ధ్వంయది పుష్పం బహిర్న హి మనుపరాశరాదు లొసగినవిభాగము ప్రకారము "అష్టవర్షా భవేద్గౌరీనవవర్షాతు రోహిణీ। దశవర్షా భవేత్కన్యా అతఊర్ధ్వం రజస్వలా॥ గౌరి, రోహిణి, కన్య, కన్యలు సంజ్ఞావాచకములు అయినచో రజస్వలాశబ్దముకూడ ఆతరగతికిచేరునా? రజస్వలాశబ్దము గుణజన్యత్వము కలదిగ తోచుటలేదా? కానిచో యెటనైనను రజస్వలా శబ్దము మఱేయర్థములోనైన వాడబడియుండినదా. 'ఋతౌంపుష్పవతీం, మలినవస్త్రధారిణీ' అష్టవర్షా భవేత్కన్యా, వారమునకైనచో కుచికేర్పడును. ప్రాప్తేతు ద్వాదశేవర్షే అనుచు పన్నెండవ ఏట వివాహము అనిన వాక్యమును పలుచోట్ల స్మృతులు వాడినవి. కావున ఈపదము పదునొకండర్థముకలది అయియుండును. అతఊర్ధ్వం రజస్వలా, అనిన రజస్వలావత్సరము పదునొకొండవ సంవత్సరమని యెంచియైనయుండవలెను, Rajaswala (Tainted) అనియు మిగిలినది కాలముతో (Tern) కూడినదనియు స్పష్టమగుచున్నది. గౌరీం దదన్నాకపృష్ఠం వైకుంఠంయాతి రోహిణీం। కన్యాందదద్బ్రహ్మలోకం రౌరవంతు రజస్వలాంఅనుటచే నివియు పైవలెనే సంజ్ఞావాచకముగనే యున్నదని చెప్పవలెను. అతఊర్ధ్వం అటుపిమ్మట అనగా పదికిపైని వాత ఎంతఅయినను రజస్వలాఅనియే వ్యవహరించనగును. గౌరీం దశవర్షాం కన్యాం అని యొకటను 'గౌరీం అనాగతార్తవం' అనియొకచోటను చెప్పియున్నాడు స్మృతికర్త. మొదటిది సంజ్ఞా

వాచకము. రెండవది గుణసంబంధి యనుట స్పష్టము. అత్రిః “వివాహేవితతే యజ్ఞేహోమకాలఉపస్థితే । కన్యాఋతుమతీం దృష్ట్వాకథం కుర్వంతి యాజ్ఞికాః । స్నాపయిత్వాతు తాం కన్యాం పతఃకర్మప్రయోజయేత్ ॥ అంతఃపుష్పం భవత్యేవ పనసోదుంబరాదివత్ । అతస్సూత్రేకుర్వీత తత్సంగం బుద్ధిమాన్నరః.”

‘వివాహకాలమున ఋతుమతియగునేని’ యనుటచే పది దాటినపిమ్మట అనువర్తము స్ఫురించుచున్నది. అందుచేతనే నాబోలు మనువు 2 వ అధ్యాయములో వివాహకాలము పురుషులకుపనయనవయస్సువలె పదియారువరకు పొడిగించుకొన వచ్చునని సందిచ్చుచున్నాడు. పరాశరునివలె పదిలోపున వివాహము జరిగితీరవలెనని ఖచితముగ జెప్పుటలేదు. రజస్వలానంతమువరకని చెప్పుటలేదు. పదియారుదాటినపిమ్మట కన్యయిష్టము వచ్చినవానిని వరించవచ్చుననుటచే మనువు పదియారేండ్లవరకు వివాహవయస్సును పొడిగించుకొనుట స్పష్టమే. ప్రాప్తేతు షోడశేవర్షే అనియుండుటచే పదునారండవవత్సరమువయస్సది రజస్వల యనిగుణమును సంజ్ఞగ నూర్చుకొనునట్లు కన్పట్టుచున్నది. సంవర్తుడు పన్నెండవవత్సరము రజస్వలాకాలమని చెప్పి “ప్రాప్తేతు షోడశేవర్షే యఃకన్యాం నప్రయచ్ఛతి । మాసిమాసి రజస్తస్యాః పితా పిబతిశోణితం । కన్యా ద్వాదశేవర్షే యాత్వదత్తా గృహేవసేత్ । భ్రూణహత్యా పితుస్తస్యాః సాకన్యా వరయేత్స్వయం॥ ఈశ్లోకములే పరాశరుని 7–8 వరకు కలవి-

గాతమేన-గారీమపి చరత్యర్థం గచ్ఛేత్పురుష ఆకులః
గారీమపి=అనాగతా ర్తవామపీత్యర్థః॥

రిపుంజయః, అవివాహితాతు యాకన్యా పుష్పయుక్తా భవే
ద్యది। చాంద్రాయణవ్రతం కుర్యాత్సర్వవర్ణేష్వయంవిధిః।

ఈసందర్భమున వేదవచనమును వినుము.

"ఆగధితా పరిగధితా యాకశీకేవ, జంగహేపదాతిమహ్యాం, యాదురీ యాశూరీనాం భోజ్యా తా"

వయసింకను ఒరిగరాకమునుపే నాభార్యవగు నీవు నన్ను పునః పునః సంభోగార్థమై ఆడముంగిసవలె పట్టుకొనివిడువవు, నీకుసంభోగార్హ మగువయసింకను రాలేదు. అనిభర్త యనగ భార్యయిట్లనును "ఉపోపమే, పరామృశమామేద భ్రాణి మన్య థాః, సర్వాహామస్మి రోమశా, గంధాకీణామివావికాః" "నేను సంభోగార్హ మగు వయసుకల్గియేయున్నాను. నన్ను బాగాఅంటి ముట్టి తడవి చూడుము. గాంధార దేశపుగొఱ్ఱెవలె నేను రోమ పూర్ణురాలనుగనుంటిని. రోమములు మొలుచుటవయసువచ్చిన దనుటకు గుర్తుగప్రసిద్ధముకాదా," శాస్త్రిగారి రజోదర్శన కాలవిచారణమును ముగించి ముందువిషయమును జూచుకొం దము. వరి 27పుటలో నపేరా-రివపంక్తిలో-తటాలున రజోదర్శన మయినదనిరి కదా! నేననినదదియేకదా? మొదటిపేరాలోని అర్థాన్వయ భేదములు స్పష్టమయినవి. తటాలునదర్శనమా? సం భవమా! నేనుచెప్పినదర్శనార్థమునే చెప్పినశాస్త్రిగారు "కేవలం

శాస్త్రమాశ్రిత్యనకర్తవ్యోవినిర్ణయః" శాస్త్రజ్ఞోపి గురుపరంప రోపదేశవిదపి-తథా- యుక్తిహీనవిచారేతుధర్మహానిః ప్రజాయతే" సూక్తిమనస్సున నుంచుకొని వర్తించెదరుకాక. 30 వ పేజి 1 పేరాలోని సంభవమసంభవమే. వారు వ్రాసిన "నచద శమేవర్షే ఋతుస్సంభవతి; అనుమాధవీయవచనప్రకారము దిగువవయస్సు అనగా పదికిదిగువ కావలసియుండగ పదియవ వత్సరము వ్రాసిరేల! ఇక్కడ శాస్త్రిగారు కుంతీవయో నిర్ణయమును జేయగలిగినారు. పసిబిడ్డ అనియే వీరిదివరకు వ్రాయుచు వయోనిర్ణయమును చేయజాలరైరి. వారియిప్పటి నిర్ణయము ప్రకారము "సూర్యసాన్నిధ్యకాలము, పదియవ సంవత్సరము. మునిసేవకొకయేడు. పదిలోనొకటి తగ్గినఎనిమిది. (10—1=8) పదిలో ఒకటితగ్గిన తొమ్మిది లోకప్రుపోకడ. 8+1=9 కదా! వీరిగణనమువేఱు. పరిశిష్టము 30 వ పేజి. 6-7-11-15-16 పంక్తులు చూడండి. పసిబిడ్డ కుంతికి తండ్రి కుంతిభోజుని కౌగిలింత సుసంగతమును జేసినవారు కథకులు. పరిచర్యా పూర్తిఅయి ముని అంతర్ధానమొందుటకు వారనుకొనిన వత్సరము సిద్ధించినదేమో, కుంతిది యౌవన మని నేను చేసినకోలాహలము ప్రతిహతమైనదని తృప్తినందిరి. శాస్త్రిగారి గడబిడ వ్రాతకు కర్ణోత్పత్తి 1లోని సమాధానము చాలక తిరిగి ఆవ్రాతలే వ్రాయుటచే వారివాదదౌర్బల్యము బయటపెట్టుట నావిధిఅయినది. "అష్టవర్షా భవేద్గౌరీ" పాఠ ములోని అసందర్భము వివరించితిని. నేనేఅట్లనలేదు. ప్రామా

నగ్నికుడని లోకము చెప్పుచున్న అమరవ్యాఖ్యాత క్షీరస్వామి "అష్టవర్షాభవేద్గౌరీ నవమీ నగ్నికా భవేత్. ఇతి స్మార్తః పాఠః నాద్రియతే." అనినాడు. పరిశిష్టములో అష్టవార్షిక కన్య తిరిగి వచ్చినది. పురుష్యయే 'నగ్నాన్ కామయతే' తస్మాత్కు— న్యామ సుశ్రోణీస్వామంత్రా వరవర్ణినీ, సర్వధర్మోపచాయిని, కాంక్షితాహూతా బాలా, వరారోహా, కామంబులెల్లను గావించి పొందుటకు యోగ్యకన్యాశబ్దము, మని యొర్రాప్రగడగారనినది. విష్ణుపురాణము 3 అంశములోని 16 శ్లోకమును 19 శ్లోక వ్యాఖ్యను జూచియేయున్నాను. శాస్త్రిగారికన్య యిప్పుడు యెనిమిదేండ్లది కాదు పదేండ్లది. ఇదివరకు పసిబిడ్డ. విష్ణుపురాణకన్య ఎనిమిదేండ్లది. అమరసింహునిగారి పదేండ్లది. పాణిగ్రహణ మంత్రములు కన్యకే విధింపబడుటచేతను "పాణిగ్రహణమంత్రాస్తు నియతం దారలక్షణం". "పాణిగ్రహణమంత్రాణాం నిష్ఠా స్యాత్సప్తమే పదే" పాణిగ్రహస్య భార్యాస్యాద్యస్య చాద్భిః ప్రదీయతే॥ లోకసిద్ధ అవివాహిత స్త్రీమాత్రమే విధింపబడియుండుటచేత కన్యకు వివాహముకానిదనియే అర్థము సిద్ధించుచున్నది. 'దాస్యామి భవతే కన్యాం' - అనుశా - 4 - 34 శ్లో - ఇట కన్యకు వివాహము కానిదనియే యర్థము కదా? రోమకాలేతు సంప్రాప్తే సోమోభుంక్తేథ కన్యకాం। రజోదృష్ట్వాతు గంధర్వః కుచౌదృష్ట్వాతు పావకః - ఒక్కొక్కరు రెండేండ్లు భాగస్వాములు - సోమోదదద్గంధర్వాయ గంధర్వోదదదగ్నయే పండ్రెండవసంవత్సరము స్త్రీలకు రజఃకాలమని యొకటను పదు

నొకండవసంవత్సరమని యెంచుటను స్మృతులు వ్రాసినవి. పదిలోపునఅయిన రజోదర్శనము వ్యాధిజమని తెలిసినప్పటికి శాస్త్రిగారు కుంతిని పదునొకండవసంవత్సరపుదానిని జేయ యత్నించిరి. పరిశిష్టము 33 పేజిచూడుడు - ఆపదవసంవత్సరము నిండకుండగనే కర్ణోత్పత్తి, యుపునఃకన్యాత్వసిద్ధియు నయినవి. ఇదియేకుంతీబాల్యవయోనిర్ణయమని శాస్త్రిగారు వ్రాసినది. పదవసంవత్సరము నిండకుండగనే రజోదర్శనమయినదనుట సరిపడదని యెంచవలసియున్నది. 29 వ పేజీలో రెండుమాసములు 11 వ సంవత్సరము ఋతుకాలముగ వ్రాసిన వీరి కుంతీరజోదర్శనము వయఃప్రయుక్త మనుట మండూక ప్లుతమే.

## 2 పితృవృత్తాంతరహితే

అగతికముగ నేర్పడిన ఏకదేశాన్వయమును స్వీకరించిరి శాస్త్రిగారు. అన్వయమట్లు చేయవలనుగాదు. తన నిమిత్తంబున వంశమున కపకీర్తిపుట్టిల్లునని "తన కారణంబున గులంబునకును గురుజనంబులకును నపాయంబగునని యుం దలపోసి ఆది 7ఆ334" 'మద్ధితార్థం తథాత్మార్థంకులార్థం' ఆరణ్య 303 12 మే కులం,302 అ29అనికుంతి చెప్పినట్లు మూలముననుండఆమె కురక్షణేయము పితృవృత్తాంత మనుటతగదు. ఆపితృవృత్తాంతము(వర్తనప్రశస్తి). తండ్రిమర్యాదకాక ఆమెదనియే నేనువ్రాసితిని. గ్రంథోర్ధ్వవనము గన్యాంతఃపురమని నేనువ్రాసినదానిని

జూడనిర్వాత వ్రాయుచు అంతర్భవనమున నామెగూఢముగను
డుట సంభవము కాదనిరి. గూఢోత్పన్నత్వము మూలసిద్ధము
కదా ? నేనెట్లు కాదనగలను ? నియుక్తా నాపితుర్గేహే ఆది॥
శ్లో॥ మమగేహే-ఆరణ్య303అ॥ 3-వసంతీపితృవేశ్మని-వసన్నా
ప్యతి తే గేహే-సాహామంతఃపురే - ఉ 115 వసంత్యాం
పితృవేశ్మని-విశేష రాజభవనం ; ఆర-307 హంసచంద్రాంశు
సంకాశం గృహమస్యై న్యవేదయత్ - తతోహర్మ్యతలస్థా।
తతోహమంతర్భవనే - సంబోధనభయాత్పితుః - ఈప్రయో
గములు కుంతిభోజునింటికి చెల్లునా ? చెల్లవా ? రాజగృ
హము-అంతఃపురము. అతిథిగృహము-అంతర్గృహము-అంతర్భ
వనము చెప్పబడినవి. దూర్వాసునివద్దకును గుంతివద్దకును గుంతి
భోజుడు ప్రాతస్సాయంసమయములందు వెల్లి సేవాప్రవృత్తి తెలు
కొనుచుండువాడగుటవలన వేఱేగృహము లున్నట్లు తెలియు
చున్నేయున్నది. రాజకుటుంబమువారు వసించు గేహములు రాజ
గేహములేయగుచున్నవి. రాజభార్యలు తమకుమార్తెలను
తమవద్దకు బిలిపించుకొనుచు వచ్చినట్లు గ్రంథములలో జదువు
చుందుము. బంధుపక్షభయ—బాంధవపక్షభయ శబ్దము లుప
యోగములోనికి వచ్చినవి. "బంధుపక్షభయాద్భీతా లజ్జ
యాచ యశస్వినీ" ఏకాగ్రం చింతయామాస కింకృత్వా
సుకృతం భవేత్" బంధువులలోజేరిన తండ్రిని వేఱుగచెప్ప
వలసియుండదుకదా. "తవచైవప్రియం — ఆదేశేతమతిష్ఠంత
హితంకుర్యాంనరోత్తమ । హితంచైవతవానఘ-వ్యేతు తేమాన

సాజ్వరః — సంబోధసభయాత్పితుః” అనుట యెందులకు? తండ్రియందామెకుగల గౌరవ, భయముల దెలుపుటకే — ఏక దేశసమాసముచే తండ్రినుండి గుప్తపరచనేల? జనులకు దెలియకుండగ గర్భగూహనమును జేసికొనిన ‘మద్ధితార్థం తథాత్మార్థం కులార్థం చాప్యసిందితే, యీమెను తండ్రి మాత్రమెట్లు తెలిసికొనును? “ దోషంపరిహరంతీచ పితుశ్చారిత్రరక్షిణీ। కథంతు సుకృతంమే స్యాన్నాపరాధవతీ కథం॥” ఉ. 145 అ. పితామాతాచ గురవః—మన్నిమిత్రంకులన్యాస్య-ప్త్రాభియతే దేవమాతాచాన్యేచ బాంధవాః॥ ” వీనినన్నింటిని బర్యాలోచించినచో శాస్త్రిగారి షష్ఠీవిభక్తివాదమేకదేశ సమాసముతోబాటు నిలువనేరదు. ఇట్టిదే అనుకొని రామాయణములోని ప్రయోగమునిచ్చిరి. “కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్యసంయుగే” ఇందు భీత్రార్థానాంభయహేతుః లోని ‘భీ, ఉన్నది కదా! అనుకొనిరి. ఇట ‘జాతరోషస్య కస్య, శబ్దములు షష్ఠీవిభక్తిగతములు. వీనిని పంచమీ విభక్తికి వ్యాకరణపారీణత లాగుకొననీయదు. ‘పితుః, శబ్దము రెండువిభక్తులకునుజేరు నవకాశమున్నది. పై విరోధమును గమనించక శాస్త్రిగారపమార్గమును బట్టిరి. ఇట కస్య-జాత రోషస్య” రోషశబ్దముచే “జాతరోషస్య సతః దేవాఃబిభ్యతి” అయి రామునివలన అనునదియే సిద్ధించును. “ దోషంపరిహరంతీచపితుశ్చారిత్రరక్షిణీ। కథంతు సుకృతం మె స్యాన్నాపరాధవతీ కథం” మే కథం సుకృతంస్యాత్, కావున తనచారి

త్రమునే చెప్పెననవలెను. "తమహంశాపభీత్యాచపితుర్భీతాచ" గృహమునుగురించి నేనిచ్చిన ప్రయోగములచే వీరి షష్ఠి గడచినదనియు అన్వయము తప్పదనియు విమర్శకులూహించ గలరు.

## వరప్రదానము

పరిశిష్టము 32 వ పుటలో పై విషయమును ప్రారంభించిన వీరధ్యాహారముల నింపుచువచ్చిరి. "నూనంతస్యైవ దేవస్యప్రసాదాత్పునరేవతు । కన్యాహ మభవం విప్రయథా ప్రాహసమా మృషిః" ఇటవీరు వ్రాసిన క్రొత్తదనమేమియు లేదు. ఆశాస్త్రిగారు చెప్పినట్లే ఈఅయ్యగారు చేసినారు. అట్టి వ్యవహారరీతియే యిది. నేను అన్వయించుట పొరబాటు కాదు. వారితథాజాతంకు అధ్యాహారదోషముకల్గినది. ఇట్టివర మింకొకటి భారతమున గలదుకదా! వారు సాధారణముగ నేపాత్తములలోనివియో యిచ్చుచువచ్చెదరు. నేనిచ్చినవానికిమాత్ర మీగ్రంథపుదికాదని త్రోసివేయుచుందురు. ఇప్పుడు నేను చూపునది వారు పురాణముగ జెప్పుచున్న మహాభారతము లోనిదే. ఉద్యోగ. ప. కృష్ణరాయబారపుఘట్టమున గాలవుని దత్తపుత్రిక, యయాతిసుత, బ్రహ్మవాదిచే "ప్రసూత్యాం తె ప్రసూత్యాంతే కన్యాచైవభవిష్యసి" వరమును బొందినది. అందుచేతనే 'కుమారీభూత్వా, కొంతకాలము రాజ్యలక్ష్మి ననుభవించి తిరిగి కుమారి యగుచు వచ్చినది. ఈమెనే "తన

యవతినయ్యు గన్యనగుదుననెను" తిక్కన — ఈకన్యాత్వ ప్రాప్తి యెవరివలన జరిగినది? కర్తయగు సూర్యుడివలెనే భోక్తలగు రాజులునా? అనిప్రశ్నించగలరుకధకులు. వరములో నిదే ఆభాగము. సంతానప్రదబ్రహ్మావాదివలననే మాధవిపునః కన్యయగుట "శుశ్రూషాహిబలంస్త్రీణాం" ఉ.27.శీలం-శమద మాదివృత్తం-యధాఅస్యాః పృధాయాశ్శ్రేయోర్ధమవధానేన సమాధికాలే యత్నమకరోత్ - యత్నేనతస్యాః కళ్యాణం చింతితవాన్. "తస్యాస్తు శీలవృత్తేన తుతోష:ద్విజసత్తమః అవధానేనభూయోస్యాః పరంయత్నమధాకరోత్" శీలం - శమదమాదివృత్తం - పరిచర్యా - అవధానం - ఏకాగ్ర్యం తైః తుష్టః. దుర్వాసుడు కుంతీశ్రేయస్సు నాకాంక్షించిన వాడగుట, సంతానసిద్ధి స్త్రీకి సంతుష్టినొసంగు వయస్స్వ భావమునెఱింగి సంతానదాయకమగు వరమునొసంగుచు సంతానసిద్ధికి బిమ్మట గలుగు శరీరస్థితి నాలోచించి తద్విపర్యయ నివారణమును జెప్పినాడనకతప్పదు. పసిబిడ్డ అయి నచో నట్టివరము నిచ్చుటకు యత్నము జరిగించబడదు. కుంతి అవివాహితగనే సూర్యుని బిలిచి చిక్కుతెచ్చుకొనినది. నానంతస్యైవ దేవస్య ప్రసాదాత్పునరేవతు, పునరేవశబ్దము నుత్తరశ్లోకము ననుసరింపజేసి వ్యవహరించుట తగునుకాని వ్యర్థవాదముజేయుట ఉత్తమముకాదు. ఈనడుమ నామిత్రులు శ్రీ పురిపండా అప్పలస్వామిగారిని గోరగ సారళాదాస రచిత మగు నోఢ్రభారతమును నాకులభింపజేసిరి. అందిట్లుకలదు.

సిద్ధపురమునకు గుంతిభోజుడు రాజు. భార్య జంబువతి. ఆమె కర వీర నగర రాజగు మదనమహాదేవునితనయ. వృషభమాసము. సంక్రాంతివెళ్ళిన పదమూడురోజులకు పూర్ణిమా గురువాసరము. అమృతయోగము బవకరణమునాడు దుర్వాసుడువచ్చి చాతుర్మాస్యలుచేసికొను నవకాశమిమ్మని గుంతిభోజునిగోరగ తనకుమార్తె కుంతి నుపచార మొనర్ప నియమించెను. కొంత కాలము గడిచినపిమ్మట దుర్వాసుడు కుంతీపరిచర్యకు దనిసి వరమును గోరుమనగ అజ్ఞానురాలను, నీవే, నాకుచితమైన వరమిమ్మన జపమాలికతో మంత్రమునిచ్చి జపమువలన సంతానము కలుగుననిచెప్పి వెళ్ళిపోయెను. కుంతి యమునా తీరమున సాల పత్రముల బరచి కూర్చుండి మంత్రమును జపించినంత సూర్యుడువచ్చి భయపడుచున్నయామెను వరము ప్రకారము సంతానమును కనని యెడల లింగభిన్నదోషమంటును కావున నిన్ను కలిసితీరెదనన, కుంతి భగభేదమయినచో నసతి నగుదును కదా! అట్లు కాకుండ జేయుమనును. పునఃకన్యవగుదువనిచెప్పి వెళ్లెను. అతఁడయోనిశబ్దగోపనమును ఓఢ్రుడగు సారళాదాసు బయల్పరచి భగభేదనమును జేసినాడు. లోకమున కుంతి కర్ణమునుండి కర్ణుడు పుట్టెనను వదంతికలదు. సూర్యుడు సంగమించి సద్యోజనితుడగు శిశువునకు కర్ణుడను పేరుపెట్టి ముద్దాడి అభేద్యకవచామృతకుండలముల నొసగి యుద్ధమున రథముపై నిలిచినంతకాలము పరవశుడు కాడనియు దిగినచో పరులచే జంపబడుననియు చెప్పి వెళ్ళిపోయెను. ఇంద్రసేనలో

బ్రమత్తురాలగు ననంగమంజరియను నప్సరస అతిరథుడను మారుపేరుగల అంగరాజు యశోధరుని భార్య. ఆమె సంతాన కాంక్షనుండు కాలమున ప్రయాణవశమున నదీరముననున్న ఈశిశువునుగొనిపోయి తనభార్య కిచ్చెను. కుంతియు కన్యాంతః పురమును జేరెను. ఆతడే ఈకర్ణుడు.

ఇట కర్ణుడునదీతీరమునపుట్టును. భారతారణ్యపర్వమున హంసతూలికాతల్పమునబుట్టును. ఉచితానుచితముల బాలకులు గ్రహింపగలరు–వనపర్వములో 'ఉత్సృష్టకామాతంగర్భం కార యామాసభారత। మంజూషాంశిల్పి భిస్తూర్ణం సునద్ధాంసుప్రతి ష్ఠితాం। ప్లవై ర్బహుభిర్వి ద్ధై ర్బద్ధాం ప్లవనార్థంజలేనృప' 'అజినై ర్మృదుభి శ్చైవంసం స్తీర్ణ శయనాంతథా॥ ఇదిసాధ్యమేనా! అయి నచో కాలాతిశయము శాస్త్రిగారిని తొందరపెట్టదా ! ఇందు తూర్ణం, శిల్పిభిః, ప్లవైః, శబ్దముల యునికిని జూచిన సందర్భ రాహిత్యి గోచరించుటలేదా ! నదీగమనము జూతము.

మంజూషాత్వశ్వనద్యాస్సాయయౌచర్మణ్వతీంనదీం। చర్మణ్వ త్యాశ్చ యమునాంతతోగంగాంజగామహ। గంగాయాస్సూత విషయే చంపామనుయయౌపురీం 307 అధ్యాయము—ఈచంప సరయూగంగాసంగమమున కలదు. యమునలోనుండియే మం జూషనెత్తియంత్రములచే బ్రద్దలుకొట్టి పిల్లవానిని జూచిరి. శ్లో॥ 308 అ. ఈచంపానగర మంగదేశములోనిది. వనపర్వ మును గురించి పలువురు పెద్దలతో బాటు నేనాక్షేపించుటను

శ్రీ శాస్త్రిగారు పైభాగమును చదివి అయినను గ్రహించగల రనుకొందును.

భారతభాగమును జూచినను గుంతి యువతి యని యెఱిగియే దుర్వాసుడు వరమిచ్చినట్లు కన్పించుచున్నది. సంతానమును జూచియే సూర్యుడు వెళ్ళినట్లుండుటచే 'జాతం మాం న్యసర్జయత్, అని కర్ణుడు చెప్పినట్లు, పుట్టిన పిల్లవానిని వదలి వెళ్ళినట్లే కనిపించును. పై సందర్భము ననుసరించి సద్యః ప్రసూతి స్పష్టమగుచునేయున్నది. శ్రీ గొల్లాపిన్ని వాసుదేవ శాస్త్రిగారిట్లు వ్రాసిరి. "14-12-57 ఉరవకొండ. మొన్న డిల్లీ వెళ్ళియుండి 15 రోజులు హృషీకేశము హరిద్వారము, మధురా, ద్వారకలను ఆగ్రాను దర్శించి వచ్చితిని. అక్కడ పండితులుకూడ కర్ణుడు సద్యోజనితుడని చెప్పుచున్నారు. అని భాగవత నవమస్కంధ శ్లోకములను గురించి నేను చిత్రమును జేసితిననిరి. దుర్వాసవర పరీక్షను నేను చెప్పితిని కాని సూర్యవరపరీక్షను నేను చెప్పలేదే! పరీక్షవరాదిని కాని అవసానమున గాదు. ముద్రణాస్ఖాలిత్యములలో జేరిన దేవరశబ్దము. అట్లు కాదనినను తప్పులేదు. వీర్య, బల, వర శ్రేష్ఠార్థముకల శబ్దములే. వరపరీక్ష సాధ్యమె. "బలాబలంచ మంత్రాణాం బ్రాహ్మణస్య చవాగ్బలం మయామంత్ర బలాజ్ఞాతుం" సూర్యుడిచ్చినది వరమా! మంత్రమా! "వరరూప మంత్రస్య - వరమంత్ర గ్రామరూపం", అని రెండుమాటలు

చంపూ భారతములో ప్రయోగింపబడినది. ప్రథమస్తబకము 58, 59, 60 శ్లోకములయొద్ద చూడండి. కుంతి పాండురాజునకు వర రూప మంత్రదానమును జెప్పెను.

"అదశనవ్రణపీడ మహార్ఘతే రభిద ధీరతసంగమనం వినా విద్యతే - దశనవ్రణానాం = దంతక్షతనాం పీడా = దుఃఖః యస్మిన్ తత్ - చౌర్యరతత్వాది తిభావః। రతస్య, సురతస్య = సంగమనం = ప్రాపణంవినా - అభిదధే = కథయామాస - తదితరత్సర్వముపాచే త్యర్థః॥ సూర్యునిదంతములు వీరభద్రునిచే దక్షయాగధ్వంస సమయమున నూడగొట్టబడినవి. కావున నదశనవ్రణపీడ యుక్తియుక్తమే. ఇటురతసంగమనం అనినా డండీఅనంతభట్టు. రతమున కడ్డులేదు, దంతక్షతము పురుషానుభూతిని దెలుపును. మంత్రమువరాంగము. వరము దుర్వాసుడొసగినది. వరములో గన్యాత్వమున దేవతాహ్వానము జరుగుననియు సంతానము కలుగుననియు నున్నదా? కుంతికిమంత్రమాద్యాదిపర్వములిచ్చినవి. కొన్ని సంతతినిచ్చినవి! మంత్రమును మాధవికుద్యోగపర్వమీయలేదు. దుర్వాసవరములో సంతతి దీర్ఘాయుర్దాయమున్నదా? భారతములో నేమన్నాక చోనున్నది. దుర్వాసుడిచ్చినాడని కుంతిచెప్పినది. పూర్వము జరిగినవానికి తరువాతజెప్పుట గ్రథములలో బరిపాటియే. వీనికి నాగ్రాత సభ్యముగ దోచకుండుట వారి పొరపాటులోనిది. గాథము లని వారు సంతుష్టినొంది ప్రయోగించిన కర్తవ్యాచరణము

కలయిక, కలిసిన, పురుషసంబంధములు, సీలకంఠుని సంగ మోహాక్రాన్తి, మొదలగు శబ్దములకు ప్రకాశార్థములిచ్చి గ్రంథములోని సందర్భరాహిత్యమును స్పష్టపరచుట నేను జరిగించి నది. ప్రాదాచ్చుత్సస్యై కన్యాత్వ శ్లోకపు ప్రథమభాగములోని దత్తమేది? గర్భమేకదా? అయినచో నేనుచెప్పిన మార్గే అవసరముకాదా? గర్భాధానము తరువాతనేకదా! కన్యాత్వ దానము! ప్రసూతిగర్భధారణములని వ్రాసినవారి అన్వయ మంతయు నిట్టిదే. సురేశ్వరాచార్యులవారి సూక్తిని వీరు గ్రహించినచో విజ్ఞానప్రదాన్వయ పద్ధతిని "అన్వయవ్యతిరే కాభ్యాం వినావాక్యార్థబోధనమ్। నస్యాత్తేనవినాధ్వాంసో నాజ్ఞా నస్యోపపద్యతే। వినాజ్ఞాన ప్రహాణేన పురుషార్థస్సుదుర్లభః" (నైష్కర్మ్యసిద్ధి) సంపాదించుకొనగల్గుదురు—

ఇదిపరాస్తమో స్వాస్తమో వారి చిత్తశోధన మనుస రించగలదు. కన్యాత్వోచ్ఛిత్తిని జరిపించినవాడు వరమివ్వవల సినవాడనిరి. యయాతికుమార్తెకు వరమిచ్చిన బ్రహ్మవాది కన్యాత్వవిచ్ఛిత్తిని చేసినవాడుకాడుకదా! కన్యాత్వదాత బ్రహ్మ వాదియని శాస్త్రిగారంగీకరింపక తప్పదుకదా! కర్ణునివలె మాధవీపుత్రులు విడువబడిరి. (బుద్ధిపూర్వముగనే) కాని తండ్రులనపవిద్ధుల జేయలేదు. "మాతాపితృభ్యాం ఉత్సృష్టం, తయోరన్యతరేణవా। యంపుత్రం ప్రతిగృహ్ణీయాదపవిద్ధ స్సఉచ్యతే" (సూతః అతిరథః) ఇతిస్మృతేః, మంజూషాయాం

కాష్ఠపంజరే, పృథయాకుంత్యా అపవిద్ధం కన్యాత్వాల్లజ్జయా పరిత్యక్తం, కర్ణం, పుత్రం, అవాప. విష్ణుపురాణమును వ్యాఖ్య యును = ఎవరికిపుట్టిన పుట్టినబిడ్డవురా ? వెక్కివెక్కి యేడ్చెద వని కర్ణోత్పత్తిలో నేననినదదియే. దుర్వాసుడే యీకన్యాత్వ వరమునుగూడ నిచ్చినాడనుటలో విప్రతిపత్తి లేదనియు, నావాదము ప్రమాణమనియు, శాస్త్రిగారివాద మప్రమాణ మనియు ఫలితార్థము. కుంతీసూర్యుల గాథపై శాస్త్రిగారు వేదాంతదర్శనమును ప్రమాణీకరించిరి. తత్సారీణులు తామసి తెలుపుటకు గాబోలును. ఆదిత్యునిమాటయే అందున్నది కాని యమ, వాయు, పురుహూతుల నేల యెత్తలేదో ఆగ్రంథము !

వాంఛితపరరూపధారణము జ్యోతిస్స్వరూపములకు మంత్రములచే గలుగవచ్చునని చూపుటకు మాత్రమే ఆవాక్య ముపయోగించును. "యథేష్టంచ ...ంతంవిగ్ర హంగ్రహీతుం సామర్థ్యమ్'' (వేదాంతదర్శనమ్), ఇంద్రుడు గౌతమాది (కుక్కుట) రూపముల ధరించుట నీవిధముగ నీదర్శ నము చెప్పును. ఇదియే వేదాంతమా ? కుంతీసూర్యసంగమ ప్రేక్షకులుగ దేవతల ప్రవేశపెట్టినభారతభాగమును నేను నిర సించితిని. తగదేమి ? ఆదిపర్వములో ధర్మరాజు ద్రౌపదితో నస్త్రగృహమున (సర్వస్వామ్యము) నుండ బ్రాహ్మణగోరక్షకై అస్త్రగ్రహణ మొనర్పబోయిన యర్జునునిచే చాంద్రాయణ

వ్రతమును చేయించిన భారతి మట్టిస్థితిలోనే యున్న (కుంతీ ప్రలుబ్ధం) కుంతీసూర్యులను జూచి నవ్వుచుండుటకు ప్రేక్షకులుగ దేవతల జిత్రించిన భారతభాగము శ్యానసమాగమమునకై చేసినదనుట తప్పా? ఇటుచూడండీ పాఠకులు! భాగవతము నవమస్కంధము. 'ఏకదాగిరిశం ద్రష్టుంఋషయః సువ్రతసు వ్రతాః। దిశో వితిమిరాభాసాః కుర్వంతః సముపాగతాః తాన్విలోక్యాంబికా దేవీ వివస్త్రా వ్రీడితా భృశం। భర్తు రంకా త్సముత్థాయ నీవీ మాశ్వథపర్యథాత్। ఋషయోపి తయోర్వృత్త్వా ప్రసంగం రమమాణయోః॥ వినివృత్తాః – విని వృత్తాః॥ ప్రసంగం–రత్యభినివేశం। స్త్రీ ప్రసంగకలుషితమనసః' ఈప్రేక్షకులు, ఋషులు, సువ్రతులు. కావుననే కలుషితమన స్కులయిరేమో! ఈకలుషము వీరినింక్షకుబంపినది కాని సంబర మును గలిగించలేదు. దేవతలయినచో నేమగునో? బహ్మ శిరోపహారణమువంటిది సంభవించునేమో? ఇట సంబిక్ష వివస్త్ర, రత్యభినివేశిత యందురేమో కథకులు. దేవతలను జూచిసిగ్గుపడిన, కుంతికి, పరాశరుడు సత్యవతికివలె, చాటును గల్పించలేదే! రహస్యస్థల సంగమోపస్థితిని జెప్పలేదు, భార తము! రత్యభినివేశముకాదా సంగమోపాక్రాన్తి? న్యాయసమ న్వయమెట్లుజేసెదరో శాస్త్రిగారు! నావ్రాత హేయమో పేయమో విమర్శకులకు దోచకుండుట కల్లదని నామనవి–

# సద్యః ప్రసూతి

ఈవిషయము నేనురచించిన కర్ణోత్పత్తిలో బూర్తిగ
చర్చింపబడినది. ఇట కర్ణనిషేకజన్మశబ్దము ప్రధానముగ
నున్నది. నాకన్నవరము సభలో ప్రవేశమున్నది. సామర్ల
కోట, కోలంక, మొదలయినచోటులు వారికాశ్రయభూతములు
కావచ్చును. ఆశ్రయప్రధానవిషయముగ నుండు ధనార్జనము
నకు ప్రయత్నించిన నట్టిప్రవేశమును నేనును బలుచోట్ల సంపా
దించుకొనగలను. ఈమాటలు నాచేత వారెందుకు వ్రాయిం
చుకొనుచుండిరో వారిపరిశిష్టము చెప్పగలదు. ఇంకవారి
నిషేకజన్మ కర్మధారయ సమాసస్వరూపమును జూతము.
ఐతరేయారణ్యభాష్యము. "పితృశరీర, మాతృశరీర, స్వశరీర
రూప మావసథం దర్శయతి - పురుషేహవా అయమాదితో
గర్భోభవతి - యద్రేతః - ఇతియోయం జిఘృక్షుర్జీవాత్మా
సోయంపురుషే పితృశరీరే ప్రథమతో గర్భోభవతి - నచాత్ర
స్త్రీగర్భవ దుదరవృద్ధ్యా సోభివ్యజ్యతే. కిన్తు యదేత్ పితృ
శరీరేసక్తం ధాతోరూపం రేతోస్తి, తదేవ గర్భయిత్యు
చ్యతే. తస్మిన్రేతసి జనిష్యమాణస్య జీవస్య ప్రవిష్టత్వాత్ -
తస్యగర్భస్య జన్మప్రకారం దర్శయతి - తద్యదా స్త్రీయం
సించత్యథై జ్జనయతి తదస్య ప్రథమంజన్మ - ఇతి తాదృశం
రేతోయదర్తుకాలీనేన గమనేన స్త్రియాః యోనౌ గర్భా
శయేసించతి - అథ తదానీ మయంపురుషఏవ జీవాన్తరా

షిష్టరేతో రూపం శరీరంజనయతి - తదేతద్రేతో నిస్సరణ రూప మస్యరేతస్యవస్థితస్య జీవస్య ప్రథమంజన్మేత్యు చ్యతే. తస్యత్రయ ఆవసథాః ఇత్యుక్తానాంమధ్యే ప్రథ మావసథా త్పితృశరీరరూపా త్సంపన్న మితికృత్వా ప్రథమం జన్మ భవతి-. మాతృశరీరా న్నిర్గమనస్య పూర్వోక్తజన్మాపే క్షయా ద్వితీయత్వం దర్శయతి. తదస్య ద్వితీయంజన్మయితి" శాస్త్రిగారుదీనికి వివరణమును వ్రాయుచు నిట్లువ్రాసిరి. జన్మకంటె వేరుకాని నిషేకజన్మ వేదప్రసిద్ధమని తెలిసినదా? నిషేకజన్మశబ్దములకు సార్థక్యము మనసుకిప్పుడు వచ్చినదా? ప్రథమాంశము ప్రత్యుక్తమైనది. అని. ఈవ్రాత వారికి దెలిసి వ్రాసినదేనా? జన్మకాని నిషేకజన్మ ఒకటనిరే. మొదటి జన్మయేది? వివరములేదే? వ్రాతయంతయు తుషాఖననమే ఇటుచూడుడు. "పశ్యంత్యేవం విధం సిద్ధాః జీవం దివ్యేన చక్షుషా । చ్యవంతం జాయమానంచ యోనించానుప్రవేశితం తస్యస్థానాని దృష్టాని త్రివిధా నీహశాస్త్రతః" అను - గీతాపర్వ. 17 అ — అవసథము నవస్థయని శంకరులు. రూపమనికొండఱు. జీవయాత్ర The various stages of the life of a traveller క్రమము చూపించినదీ మార్గము. శుక్ర మన్యత్రసంభూతం పునరన్యత్రగచ్ఛతి. మొదటిది రేతో జన్మ (సంభూతం) - రెండవది యోనియందు ప్రవేశించుట (గచ్ఛతి-గమనము) మూడవది శిశురూపము - శిశురూపమున చ్యవనము. కావునజన్మములు మూడుకావలెను. పుట్టనిదే

యోనికిజారుట యెట్లు? పురుషునికి బుట్టిన శుక్రముస్త్రీయోని సందును. ఆశుక్రమున సంతతి కలుగునని హామీలేదు. "ఆ(మ పుష్పోపమాయస్య నివృత్తి రూపలభ్యతే" అను 13–14 కేషాంచిత్పుత్రకామానా మనుసంతానమిచ్ఛతామ్ । సిద్ధా ప్రయశమానానాం నచాండముపజాయతే — మాసల పర్వము — గర్భధారణయోగ్యశోణిత సమ్మేళనము సిద్ధించక నశింపుకూడ కావచ్చును. జీవుని యాత్రాపద్ధతి జెప్పుటకార ణ్యము ప్రయత్నించినది. భారతానుకూలముకాదు. మూల మునను్న భావములు పూర్తిగభాష్యములలో మారినవి. పితృశరీర మాతృశరీర స్వశరీరములు మూడును జన్మములే. రేతస్సును స్త్రీగర్భమందు జార్చుచున్నాడు. అది ప్రథమజన్మ మెట్లగును? శుక్రజననము ప్రథమజన్మ కావలెను. శుక్రనిస్సర ణము జీవుయితే శుక్రజననమునేమనవలెను? అందువలననే పితృశరీరసంబంధమయినది 'ఆపో రేతోభూత్వా శిశ్నం ప్రావి శత్' ఐ-2-3. యోనియందు నిస్సరణానంతర రేతశ్శోణిత సమ్మేళనము రెండవది. యోనినుండి (గర్భమునుండి) భూపత నము మూడవజన్మ (స్వశరీర) ఇదియే పై పితృశరీర, మాతృ శరీర స్వశరీరశబ్దములచే జెప్పబడినది. కానిచో స్వశరీరశబ్దము వ్యర్థమగుచున్నది.

† ఐతరేయో పనిషత్ మూలము "పురుషే హవా" యదేత ద్రేతః ఇతియోయరజిత్రుష్ణు ర్జీవాత్మా సోయం పురుషే పిత్ృ

శరీరే ప్రథమతో గర్భోభవతి - యదేతద్రేతః తదేతత్ సర్వేభ్యోంగేభ్యః తేజఃసంభూత మాత్మన్యే వాత్మానం బిభర్తి తస్యథా స్త్రియంసించతి అథైనజ్జనయతి తదస్య ప్రథమంజన్మ సోఽస్యాయమాత్మా పుణ్యేభ్యః ప్రతిధీయతే. అథాపి అయమితరఆత్మా కృతకృత్యః వయోగతః ప్రైతి సః ఇతః ప్రయన్నేవ పునర్జాయతే. తదస్యద్వితీయంజన్మ — రెండవదానిలో జెప్పబడినదానిని స్పష్టీకరించిన పిదప మూడవదానిని గురించి చెప్పనది. తదస్యామృత్వా ప్రతిపత్తవ్యం, యత్తృతీయంజన్మ. నను సంసరణరహితః పితుః సకాశాత్ రేతోరూపేణ ప్రథమం జన్మ. తస్యైవ కుమారరూపేణ మాతుః ద్వితీయం జన్మోక్తం తస్యైవతృతీయే జన్మనివక్తవ్యే ప్రేతస్య పితుర్యజ్జన్మ తత్తృతీయమితి కథముచ్యతే?. పై ప్రశ్నకీసమాధానమును జూడండి.

నైషదోషః పితాపుత్రయో రైకాత్మ్యస్య వివక్షితత్వాత్ సోఽపిపుత్రః స్వపుత్రేభారంనిధాయ ఇతఃప్రయన్నేవపునర్జాయతే యథాపితా తదన్యదుక్తమితరత్రాప్యుక్తమేవ భవతీతిశ్రుతిః పితాపుత్రయో రైకాత్మ్యత్వాత్ సోఽపిపుత్రః స్వపుత్రే భారం నిధాయ = కుమారుడే ముందుగతించిన నీ వాక్యమెట్లన్వయించును ? —

"నచాండ ముపజాయతే" గర్భమే నశించిన నేమగును ? కావుననే తగిన ఉపపత్తిసిద్ధించక పైవలె వివక్షించుకోవలసి వచ్చినట్లున్నది. ఈ రెండు ఐతరేయవాక్యములవలనను భారత

వచనముల వలననుగూడ రేతో నిషేకరూపేణ రెండవజన్మ కాని పితృరూపముచే మూడవజన్మయే యగునని స్పష్టమగు చున్నది. మనమట్లు వివక్షించుకొను నవకాశమంజే యున్నది. బ్రహ్మసూత్రములలో "యోనేశ్శరీరం" అను వాక్యమును చూడండి. రేతస్సే పితృశరీరమనిన ఐత రేయారణ్యక భాష్యము మొదటివాక్యములోని పితృశరీర శబ్దసార్థక్యము కన్పడుచున్నది. కావున శాస్త్రిగారి ద్విజ త్వము తొలగిపోయినదని పర్యవసానము. నిషేకజన్మవ్యాఖ్య పొసగదు - ద్వంద్వసంభూత మనుటలగ్గు. రఘువంశమూ జన్మశుద్ధి కలదట. మహాపురుష జననమునకు గారణమగు శుద్ధ ప్రవిత్ర రేతస్సే పయి వాక్యమునకు భావ మగును కాని శిశువుకు మంత్రసాని నీళ్లుపోసి శుద్ధిపరచుట కానేరదు. రేతో జన్మ ప్రధమజన్మమనుట స్పష్టము. నిషేకము ప్రధమ జన్మయని కర్ణోత్పత్తిలో నిచ్చినది శాస్త్రిగారికి విభ్రాంతి జనకమైనది కాని నాకు కాదు. నిషేకజన్మమును దంద్వ సంభూతమని నేననుచున్నాను.

వ్యాఖ్యా మర్యాదనుగురించి భారత ప్రక్షిప్తములను చోట వ్రాసియేయున్నాను. రేతస్సును గర్భమనుచున్న వీరి భంగపాటుకెవ్వరును సాయపడజాలరు. 43 పేజి 4 పేరాలో 'దశోత్తరేకును తతఃకాలేన, కును సంబంధమే లేదనుచున్నవారే. తతఃకాలేన, నేను ప్రక్షిప్తమనినాను.

ప్రక్షిప్తమనినదానికి శాస్త్రిగారు నావలన సమాధానము బొందనక్కరలేదు. ఆ అధ్యాయము తుదను “మంజూషా త్వశ్వనద్యాస్సాయయౌ చర్మణ్వతీం నదీం। చర్మణ్వత్యాశ్చ యమునాం తతో గంగాంజగామహ। గంగాయాస్సూతవిషయం చంపామను యయౌపురీం. విష్ణు-పు. 4 అం-18 అ. 27 శ్లో. యోగంగాగతం మంజూషా గతం శ్యాపంజరస్థం పృథయా పరిత్యక్తం కర్ణంపుత్రమవాప అనియున్నది. కథ యిక్కడకు బూర్తిఅయినదికదా. “తతఃకాలేనతో బూర్తిఅయిన పిమ్మట. “సమంజూషా గతః గర్భః తరంగైరూహ్యమానకైః। అమృతాదుత్థితం దివ్యం తనువర్మ సకుండలం। ఏత ద్గుహ్యంమహారాజ సూర్యస్యాసీన్మహాత్మనః। ససూర్యసంభవో గర్భః కుంత్యా గర్భేణధారితః। జాతమాత్రంచతం గర్భం ధాత్ర్యా సమ్మంత్ర్యభామినీ. ఇట మొదటి గర్భము కుక్షి. రెండవగర్భము శిశువుకదా! ఈ రెండు శ్లోకములను శాస్త్రిగారు ప్రక్షిప్తములు కావనలేరు. కావున నేను పయిశ్లోకము ప్రక్షిప్తమనుట దోషము కాదుకదా! నేను కర్ణోత్పత్తిలో ఇచ్చిన కాలేన ‘క్షణేన, ఇవి తృతీయార్థకములే. తసిల్, కాలేనతో గలియుటయే వీరి కాధారము కాగలదు. ఆ సందర్భమున వారిచ్చిన శ్లోకములలో పాఠాంతరములు కలవు.

వినిగుహతీ-వినిగూహ్యావై, నచైనాం-నచైనం, నహితాం-నచతాం, నార్యన్యా-నైవాన్యా. ఋతే. వినా-కాచిత్ -

కాంచిత్ ॥ సా-తం నచైనాం-నచైనం. సా-తం. ఇట శిశువును దాచుటకాదా ? పిల్లవానిని దాచుట గర్భమును దాచుట రెండును భయజనకములే. మొదటిది త్వరలో జరుగునది. రెండవది కాలయాపనము కావలసినది. కొంతకాలమునకు బిమ్మటి సంఘటనమునకు నిశీథమును జెప్పనక్కరలేదు. ఎప్పుడైన నీపని రాత్రి జరిగించవలసినదియే. ఉదయమారంభముగ జరిగినది కావుననే నిశీథమును జెప్పినది భారతము. ప్రమాద భూయిష్ఠమై కుంతిని భయచకితను జేసినదీకృత్యము "తన కారణమున గులంబునకును గురుజనంబులకును నపాయంబగు ననియుం దలపోసి" - (ఆది 7 ఆ 334 ప) "అచ్చట దడయం వెఱచి నన్నయగారు" కావున దొందరగ జరిగించవలసిన కార్యమయినది "కృచ్ఛాల్లోకస్య బిభ్యతీ" పసిబిడ్డయా ? తిక్కనగారి తీర్పులో నకులుడు పసివాడు — ఈపసితనము Term of endearment. ఉదితుడైనసూర్యునికోరుట, సంభాషణము, కొంతకాలము పట్టినది కావలెను. సంగమానంతరము జననమేకావలెను. మంజూష తయారు కావలెను. (ఇతర స్త్రీలెరుగరు కాని తయారుచేయుశిల్పియైన దెరుగవలెనుకదా) ఇంతమాత్రము సమయము సాధ్యముకాగలదు కాని పది మాసములు గడపుట యెట్లో. శాస్త్రిగారి 52 పేజీ రెండవ పేరాలోని వ్రాతవంటిదే నా ఆలోచనమునకు గారణము. కన్యాంతఃపురముగ నేనంతఃపురభవనమున కర్థమును జెప్పియుండగ బితృభవనాంతర మంటినదే

రేలనో? పితుః అంతర్భవనమే వారిని మార్పుపరచినతావు. అట్టిచో నేనుకన్యాంతఃపురము కాదని వ్రాసిన దెటనుండును? తెలుగుసాంప్రదాయ మెరుగక కవిసార్వభౌముల నూతగ గొనిరి. జాతమాత్రుడు పెట్టెలోచేర్చబడుటకు దగినంత వ్యవధికావలెను. కావున నిశీధమును వేచియుండవలసివచ్చి నది. శ్రీకవిసార్వభౌములు వ్రాసినవనపర్వములో "శుక్లె దశోత్తరే" శ్లోకపు జ్ఞాపికను బాగుగ జదివిన వారియభిప్రా యము స్పష్టము కాగలదు. కర్ణజననమునకును నదియందా శిశువును విడచుటకును గొలదిఅయినను వ్యవధిలేదని కృష్ణ భారతమనినదా? సారరహితవాదముపై విశేషముగ వ్రాయ వలసివచ్చుచుండుట గమనార్హము. 56 వ పేజి రెండవపేరా చతుర్థాంశవిచారములో బిడ్డలగనినపుడెల్లను బాలయగుచుం డునా? అనునాప్రశ్నము వీరికర్థమే కాలేదు. భారతతత్త్వ మును బూర్తిగ మనసున బట్టించుకొనకయే కథనమునకు దిగిరి. ప్రసూత్యంతే ప్రసూత్యంతే కన్యాచైవ భవిష్యసి ఉ - ప - మాధవీవచనమిది. ఈభాగమును గుంతీవరముతో గలిపి సమన్వయమునుజేసిజూచిన "జూచినమాత్రమున" వివాహ సూచక చిహ్నమేదైన నాకాలమున గలదేమో? అని నేనువెనుక వ్రాసితిని. కానిచో మాధవి నల్గుర గనినను వివాహముకాని స్త్రీ వలెనుండి తిరిగి వరులను స్వీక రించు నవకాశము కలిగియుండదు. కుంతికి నట్లేకదా? 44 పే జిలో తతః - అనంతరము. 'కాలేన సుషువే' కాలహేతుక

ప్రసూతి కలదయ్యెననిరి. కాలశబ్ద మవ్యయముతో గూడి నప్పుడు తదర్థమునే, స్వీకరించునని నేనువ్రాసినదే వారును వ్రాసిరి. తత్ అనంతరం దానిఅనంతరము - దేనియొక్క - పూర్వచర్యయొక్క తరువాత అనియేకదా? అనంతరము అనినకాలము కాదందురా? తదనంతరమున అనినను తరువాత అనియే అర్థము వచ్చును కదా? దశమే, మాసి సూతవే, లో మాససంఖ్య యున్నది. కాని దినఘటికాదులులేవు. అదిలోక సామాన్యవిషయవాచకము. తతఃశబ్దము కాలేనకు విశేషణ మనుట పర్యవసానము. నేనిచ్చిన ప్రయోగములను, పురశ్చ రణమును జేసికొనిన నవగతము కాగలదు. కాలేన, తృతీయా విభక్తియట! దానికి విశేషణమే అగుటచే తతఃకూడ తృతీయావిభక్తి యగునని వ్యాకరణపారీణులగు వీరంగీకరింప గలుదురు. దశోత్తరేను ఏకాదశముగ మూలము చెప్పలేదు, దశోత్తరాణి షట్త్రింశతు । పదికి బిమ్మట ఆరనియే. (పది యారు) కదా! దశోత్తరే చెప్పని యెడల తిథిని చెప్పనట్లయి మూలముప్రయోజన రహితమగును. పరిశి. 45 వ పేజి 4 వ పేరా. పాండిత్యప్రకర్షనుజూప నుద్యోగించినది. యుక్తి శూన్యమది. "ప్రీణాతి దేవా నమృతేన సూర్యస్సోమం సుషు మ్ణేనచ వర్ధయిత్వా । పీతంచ సోమంచ కలావశిష్టం కృష్ణ పక్షమే రశ్మిభి రక్షరంతః - సుధామృతం తత్పితరఃపిబంతి దేవాశ్చ సౌమ్యాశ్చతథైవకావ్యాః॥ "బ్రాహ్మ." శుక్లపక్షపా డ్యమినాటి చంద్రుని దర్శించు భాగ్యము శాస్త్రిగారికి భాగ్య

వశమున నీలకంఠునివలన గలిగినది. "ప్రతిపత్పాఠశీలస్యవిద్యేవ తనుతాంగతా" (రా - సుం - 59 - 35) శుక్లపక్ష ప్రతిపత్తునందు రవికిరణ స్పర్శము చాలాకొంచెము. స్వరూపస్థితియు లేదు. కృష్ణప్రతిపత్తునందు చంద్రుడు కళామాత్రహీనుడగును. అనగ క్షీణత్వమారంభమగును. క్షీణత్వారంభము దుఃఖహేతువు. కావున ప్రతిపత్తులందు విద్యాపాఠము నిషేధింపబడినది. భ్రాంతిమూలములగు వ్రాతలవ్రాసి తమదృష్టిదోషమును లోకులకంటింప యత్నించుట తగదనియెంచక వ్రాసిన వ్రాతయిది. 47 వ పేజి 2 వ పేరాలో నాఅభిప్రాయమెవరికి గావలెననిరి. తమకే కావలసివచ్చినది. ఇట్టి విద్యాభ్యాసము గురుకులవాస జనితమని విజ్ఞులెంచరు. అపశబ్దభయములేనివారిమర్యాద గ్రాహ్యముకాదు. పాఠీణులగుటచే విశ్రృంఖలపువ్రాతలు వ్రాసెడివారి కప్రామాణికములు ప్రామాణికములుగ దోచును. నన్ను స్వయమాచార్యుడనుటచే తమకాచార్యత్వము నెరపగలుగుశక్తి నాయందున్నట్లు గ్రహించినను నైజవినయరాహితి గోచరింపదని యూహించి పెనగులాట నడపుచున్నారు. "కృష్ణాష్టమీదినాదూర్ధ్వం యావచ్ఛుక్లాష్టమీదినం । తావత్కాలం శశీక్షీణః పూర్ణస్తత్రోపరి స్మృతః" బహుళాష్టమివరకు చంద్రునికి బూర్ణత్వము జాతక ముహూర్తములకు మాత్రమే యట. నిత్యవైదిక కృత్యములకు జరిగించు సంకల్పమున శుక్లకృష్ణశబ్దములు చెప్పనక్కరలేదు కాబోలు! జ్యోతిషమును కర్మాం

గముగ నెంచని వారెట్టి కర్మఠులో! ప్రచ్ఛన్ననాస్తికు లిట్టివారే. దశమికి దరువాత చంద్రునికి బూర్ణత్వమును జెప్పుట సంప్రదాయమే. కవిసార్వభౌములవ్రాత నీలకంఠ ప్రామాణికతచే ననువాదమున పరిశీలనారహితమైనట్లూజ్ఞాపిక చెప్పుచున్నది. 'తతో గర్భ స్సమభవత్' శ్లోకమునకు ముందు అధ్యాయప్రారంభమునగల శ్లోకమునకు బూర్వమే 'మంజూషా త్వశ్వనద్యాస్సా' అనునది చెప్పబడియుండును. అనినేనంటిని. ఈశ్లోకము వేఱుగ చివర చెప్పబడుటచే గర్భః అనగ శిశువనియు బూర్ణచంద్రునికి బోల్చబడెననియు నేను వ్రాసినదానిని సరిగ జూడగలరు పండితులు. "శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే" శుక్లదశమికి బిమ్మట జంద్రునికి బూర్ణత్వము కావున పూర్ణిమ సమీపతిథిని గర్ణజననమని నేను వ్రాయగ ఏకాదశియని నేనువ్రాసితి ననిరి. "దేవక్యాం విష్ణుః ఆవిరాసీత్ - యథా - ప్రాచ్యాం ఇన్దురివ పుష్కలః" శ్రీధరీయవ్యాఖ్య - పుష్కలః పూర్ణః అనేన చన్ద్రస్య దిక్సం బంధ ఇవ భగవతః దేవకీసంబన్ధః - దీని కర్థము. ప్రాగ్దిశ యందు పూర్ణచంద్రు డావిర్భవించెను. అని కథకులు బహు ళాష్టమీకృష్ణాష్టమీనిర్వచనమును దికమక జేసిరి. ఉపమించు టకు నేనుచెప్పినదే సరిఅయినది కాని వారియుక్తిసరిఅయినది కాదని బాగుగ జూచిన దెలియగలదు. వ్యాఖ్యలో దిక్సం బంధమనినాడేమి శ్రీధరుడు? ఉదయము తూర్పున జరుగు నని ఎరుగని మనుజు డుండునా? సామాన్యవాచకము

లిట్టివే." తతస్సతస్యాం తనయో జజ్ఞేచ సుమహాబలః॥
పౌర్ణమాస్యాం యథాకాన్తః చన్ద్రః సంపూర్ణమండలః॥
తారాపతి రివాంబరే, వంటిదే - పై పుష్కలః - పూర్ణః కు
బూర్తిగ గనబడునట్టి రూపమర్థము - కృష్ణాష్టమి వ్రతమును
జేయువారు పూర్తిగ నుదయించిన చంద్రునకే అర్ఘ్య
మొసగెదరు చూడుడు. వ్రతమహోదధిని. దికట్టినచో
పుష్కలః శబ్ద మర్థశూన్య మగునుకదా! 50 - 51 పుటలలో
వ్రాత యసంగతము. భారతభాగవతములలోని ఈకథల సమ
తను జూపుట తగనిదైనచో వీరి ఉదాహరణము లన్నియు
వృథాప్రయుక్తములై ఔద్ధత్యమును మాత్రము వెల్లడించు
నవి కాగలవు. భాస్కర - చంద్రపృథక్త్వమునవలంబ
నమును జేసికొని చంద్రుని జెప్పుట దిక్సూచనమనిరికదా!
ఇట కర్ణుడు రెండవసూర్యుడువలె నుండెను. అను నుపమా
నము కర్ణునకు చెప్పబడినదికాని కాలమునకుగాదు. నేను
చెప్పినది కాలవిషయము 'శుక్లేదశోత్తరే' లో కాల
విషయము కలుగుటచే తారాపతి శబ్ద ముపమితమగుటయే
కాక తన్నిర్ధారణము గూడజేసినది. భాగవతమున దేజస్సును
భారతమున సౌమ్యమును నిరూపింపబడినవి. భారతములో
నున్నదంతయు సద్యోజననద్యోతకమే. అనన్వయదోషము
భ్రాంతిజనకమై వీరి కథనముల వ్యాపించినది. నీలకంఠుడు
మాఘశుక్ల ప్రతిపత్తునందు గర్ణజననమును వ్రాసినాడు. ధర్మ
జననమునుగురించి యాతడు వ్రాసినదిట్లే తప్పినదని కర్ణో

త్పత్తిలో నేను వ్రాయగ వీరు దానికి మానము వహించిరి. వేదాంతపారీణ శ్రీ అనుముల రామనాథశాస్త్రిగారు దివ్యవాణి పత్రికలో గర్ణుడు చిత్రానక్షత్ర ద్వితీయ చరణ జనితుడని వ్రాసిరి. మఘానక్షత్రయుత పూర్ణిమ కానిచో మాఘమాసము కానేరదు. చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, మాసములలో శుక్లపక్షములందు చంద్రవృద్ధియుతి కలుగును. మాఘమున చిత్రానక్షత్రము బహుళ చతుర్థిని కలుగును. మాఘ శు ౧ మి కర్ణ జననము చెప్పుట తగదు.

తతోమాం తేజసావిశ్య, ఆవిశ్య, భవితాశబ్దముల జూచినచో,'తతః' కు' వెంటనే అనుసర్థము సిద్ధించును, అనద్యతనమయినచో పదిమాసములవలెనే దీర్ఘకాలమునకు ద్రోసివేయవలసి వచ్చును. నేనిచ్చినప్రయోగములవలన తతః కే యర్థము కలదో తెలియబడగలదు. 'సమభవత్' పుట్టెను. అనుసర్థము కాదనిన వీరే, 49 వ పేజి చివరపేరాలో "తతశ్శిశు స్సమభవత్" అనుపదముతో బుట్టుక నొప్పుకొనుచున్నారు. శాస్త్రిగారికి మగపిల్లవాడు కలిగినాడన బుట్టినాడని అర్థము కాదేమి? తతఃశ్లోకము నేనుచెప్పినట్లు ప్రక్షిప్తము కావలెను. వారికికావలెనంటే కావలసినచోటికి దెచ్చుకోవచ్చును. కాని చివరకు మాత్రము చేర్చవీలులేదు. కన్యాచైవ భవిష్యసి అద్యతనమా? అనద్యతనమా? పదిమాసములయిన పిమ్మట కన్యయగునా? కౌగిలినివీడగనే కన్యయగునా? ఎప్పటికప్పుడే

కానేరదా? భవిష్యసివలెనే జనయిష్యసి కావలెను. భవితా కూడ భవిష్యసి వలెనేయగును. కావున నేనుచెప్పినది యే సుఖప్రసూతికల అన్వయము కాగలదు. 51 వ పేజిలోని వ్రాత పండితమ్మన్యులు వ్రాయతగినది - వాకోవాక్యతగ దేలినదిది. 52 వ పేజీ కుంతీకృత్య మంతయు ప్రాతః కాలమునందే జరిగినదని నేననలేదే. కుంతి మంత్రము జపించినదికదా! రజోదర్శనమేమయినదండీ శాస్త్రిగారూ? జపమునకును సంగమమునకును రజస్వలాత్వ మడ్డుతగులదని వ్యాసుడు చెప్పినాడండీ? మీకుసంభవింపబోవు నన్వయపు చిక్కు దొలగింపజేయబూనుటచే రజస్వలావిషయమెత్తుకొనక వదలివై చితినని ఇదివరకు వ్రాసియే యున్నాను. కుంతీ కన్యాత్వపరీక్షశీర్షికలో ఊకదంపు హెచ్చు. బిడ్డతల్లివివాహ మన కర్ణుడనబడుబిడ్డతల్లి వివాహమను టపచారమా? అయి నచో కన్యాయాంజాతః కర్ణః 'కౌముదీ, బాలమనోరమా, మహాభాష్యప్రదీప వాక్యములును. కన్యాయాంజాతః దుర్యో ధనాశ్రితః॥ అగ్నిపురాణవాక్యమును; "పూర్వమనూఢా యాశ్చ భగవతా భాస్వతా కానీనః కర్ణోనామ పుత్రో జన్యత" విష్ణుపురాణవాక్యమును, "కానీనః కన్యకాజాతః" అనుతద్వ్యాఖ్యాప్రసక్తియు సాధకములు కానేరవు కదా, రాజశేఖరుడు కర్పూరమంజరిలో గర్ణునిధర్మజాగ్రభ్రాత యని నాడు. కుంతివివాహమునాటికి బిడ్డతల్లియేనండీ శాస్త్రిగారూ? సూర్యదేవుని వరమును బాటింపని నావాదము మీకనర్థమైనది.

లోకమది తెలిసికొనకపోవదు. 55 వ పేజీలో ద్వితీయాంశము ననుసరించి వ్రాసినదానిని బట్టి సర్వాదరణీయ సంస్తుతిపాత్ర మగు కుంతిచరిత్రమును భారతము దోషభూయిష్ఠముగ శంకించుటకు గారణమేమి! కుంతీకుమారులందరు పరపురుషసంజనితు లయ్యు ఖ్యాతినొందిరికదా?

ఈ కర్ణజననము మాత్రము గుప్తపరచుటకును నోరెరుగని గ్రుడ్డును నీటద్రోయించుటకు గారణమేమి? కథకులు కుంతి సూర్యసంగమమున వన్నెతగ్గినబంగారమయినదని వ్రాయుటకు హేతువేమి? ప్రతిష్ఠకు బెనగులాడుచున్నామని శాస్త్రిగా రనుకొనకుండుటకు హేతువేమి?

## స్వేచ్ఛానిచ్ఛావాదసమీక్ష

56–57 పేజీలలోనివ్రాత పిష్టపేషణమనుకొనియుండరు. 58 వ పేజీ "తమహం శాపభీతాచ పితుర్భీతాచ భారత। వరై రసులభై రుక్తా నప్రత్యాఖ్యాతు ముత్సహే॥ న + ఉత్సహే ఉత్సహించనైతిని. అనుదానికి నోత్సహే—ఉత్సహించలేక పోతిని. ఈ 'లేక'యేమి? ఉత్సహించనైతిని అనిన అడ్డు చెప్పలేకపోయితిని అని అర్థము కాదేమి? 'యావనమత్రాప రాధ్యతి నచారిత్రం' — మృచ్ఛకటికము. పూనుకొనిన అనుటలో వీరిభావమేమి? 58 పేజి చివరపేరాలోనివ్రాత తొందరపూనుకొని వ్రాసినదికావలెను. "న తేశక్య మనాఖ్యాతు మాపద్ధర్మం తథావిధం" పై నోత్సహే కన్వయించిన స్పష్టము

కాగలదు. నేనడ్డుజెప్ప కంగీకరించితి ననుటలో విప్రపత్తి యేమిటో ? వారిపరిశిష్టములో దేలలేదు. శాస్త్రిగారి మాట లతికించుకొనినవి. కావుననే నిలుచుటలేదు. వెనుకటిరంధ్ర ములుకూడ బయలు పడుచున్నవి. 59 పేజీలో బాలాం పుంయోగమ నిచ్ఛంతీం బాలామివ, నీలకంఠుడు. బాలామివ, అనుచోట 'గతాప్రథమయౌవనా, ప్రథమయౌవనమనుట క్లిష్టము లేకయేకదా ? ఇవ తెచ్చి అనిచ్ఛను తోడుంగ గొనుట ! ఇది స్వేచ్ఛావాదము కాకమరేమి ? 60 వ పేజిలో అనార్య కృత్యమును పరాశరుడు సల్పినట్లొప్పుకొని దృష్టముకానట్టి ప్రబలకారణమేదో గోచరించుచున్నదనిరి. గోచారమునొంద నట్టి దృష్టముకదా అది. అదేమో ! సత్యవతీదర్శనమే ప్రబల దృష్టకారణము. పురాణములనిండుగ నట్టి సద్యోజననము లుండగ నీ కర్ణజననముమాత్రము వీరికాశ్చర్యదాయకమైనది.

## కుంతీ పుంయోగేచ్ఛ

ఈసందర్భమున వారొనర్చిన వాదము సరిఅయినదట— కుంతికి పుత్రేచ్ఛను గల్పించుట నా అవినీతట "ఉత్పత్స్యతిహి పుత్రస్తే యథాసంకల్పమంగనే" ఈసంకల్పము నేమనెదరు ? "యదిపుత్రో భవేదేవం యథావదసిగోపతే । యదిపుత్రో మమభవేత్త్వత్తః సర్వతమోనుద । పుత్రోమేత్వత్సమోదేవ భవేదేతత్తతోబ్రువమ్" పైసంకల్పమిందు ద్యోతమగుట లేదా ? వరదానకాలికవయస్సు యౌవనమనుట తోచుచుం

డుటలేదా! "కన్యకాత్వేపిమయ్యేషా కాముకీతిస్మరన్నివ ప్రసూతిదివసం కుంత్యాః ప్రాదిద్యుతదహస్కరః చ। భా ప్ర। స్తబకమ్॥ 67 శ్లో॥ వాఖ్య = ఏషాకుంతీకన్యకాత్వే అనూఢత్వదశాయామపి మయివిషయే *కాముకీ అభూత్ ఇత్యుక్తప్రకారస్య వృత్తాంతస్తేతి శేషః స్మరన్నివేత్యుత్ప్రేక్షా"

ఇట కుంతిదనిచ్ఛయేయని యున్నదా? కథనము స్వేచ్ఛావాక్యముకాదా! పుత్రునిగలిగించెదనని వాగ్దానము జేసినచో "అనేనసమయేనమే సంగమోస్తు" 'ఇప్పుడే నన్ను కలియుము' అనుటను గమనించండి శాస్త్రిగారూ! కోపహారిణులుకూడకావలదు' "స్త్రియంస్పృశేదదేశేయః స్పృష్టోవామర్షయేత్తయా। పరస్పరస్యానుమతే సర్వం సంగ్రహణం స్మృతం".

శ్లో॥ "కాప్రీతిః కింసుఖం పుంసాం బలాద్భోగేనయోషితః। అప్రీతాం యువతీం నారీమంతర్వత్నీం రజస్వలాం। వ్రతకర్త్రీమకామాంకః కామయేత బలాత్పుమాన్" బ్రహ్మోత్తరఖండము - ప్రథమాధ్యాయము.

యోకామాందూషయేత్కన్యాం స సద్యోవధమర్హతి అకామాం కామయానస్య శరీరముపతప్యతే। నాద్యూనాంతు స్త్రియంగచ్ఛే న్నాతురాం నరజస్వలాం। నానిష్టాంప్రకుపితాం। నాప్రశస్తాం నగుర్వీణీం। అనిష్టాం-అకామాం-అద్యూనాం

---

* కాముకీ-అనిచ్ఛా-యేనా!

అననుకూలాం = విష్ణు. 3 అ. పరస్పరానుమతికావలెను. అనిచ్ఛకూడదు. పైరకపు స్త్రీలనుగూడి వధనొందదగిన వాడుగ సూర్యుని దయాపజేసెదరే శాస్త్రిగారు. ఆదేశే దేవతాదృష్టిపథమున బగటియందుమహిమవలన రజస్వలయుండగ అనిచ్ఛా(అనిష్టాం) చేయిపట్టి సంగమోపాక్రాన్తుడైనసూర్యుడుశిక్షార్హుడుకాడందురా? రేతస్సేకస్స్వయోన్యాసుకుమారీష్వన్త్యజాసుచ। సఖ్యుఃపుత్రస్యచస్త్రీషు గురుతల్పసమంవిదుః॥ అగ్ని - 101 - 27 శ్లో. తీగెనుకదపి డొంకపాలు చేయకండి శాస్త్రిగారూ! కుంతియెట్టికోరికలు లేనిదనినేను వ్రాసితినా? ఎట్టి కోరికలుఅనుటలోమీయుద్దేశమేమియో! బాలామివవరకునేను వ్రాసినదర్థముకాదని తప్పుత్రోవను బోయినారు. 'ఇవ' శబ్దమునకు పుంయోగేచ్ఛలేకుండుటను నీలకంఠుడు చెప్పినాడా? అయినచో కథకులు "ప్రలోభితురాలై" భావము దుష్టముకాదా? కావుననే 'బెల్లించి, అనినేను వ్రాసియుంటిని. నీలకంఠుని వ్రాతకు మీరు తప్పర్థము వ్రాసినారుకదా! ఈ 'ఇవ' ప్రౌఢార్థముకలదే అయినది. ఇకనీ శ్లోకముల వరుసను జదువుకొనుడని శాస్త్రిగారిని హెచ్చరించుచున్నాను.

## సంఘర్షజననము

పరిష్టము 62వ పేజీ 3వ పేరాలో 'క్షత్రము స్వర్గమనమెట్లుజేయు' నని శంకించుకొని సమాధానమిచ్చుటకు లేనందున వ్రాతపరాస్తమయినదనిరి. కర్ణోత్పత్తిలో నారదుడు

ధర్మజునికొరకు కర్ణార్జునవైరమేర్పడినదని కన్యాగర్భనిర్మాణ హేతువదియని చెప్పెనని నేను వ్రాయగ 'పరి 62 పుట చివర, భారతములోనట్లు లేదని వ్రాసినారు. వారు వ్రాసిన శాంతిపర్వము 2 అ 2 శ్లోకపు నీలకంఠవ్యాఖ్యలోనే "తవార్థమనయోర్వైరం దేవైరుత్పాదితమ్" అనియున్న దానిని జూచియు బ్రతారించు చున్నారు "క్షత్రము శస్త్రపూరితమయి స్వర్గము నెట్లు పొందునా! అని ఆలోచించి తన్నిమిత్తము" అని వీరి వ్రాత కర్థము నేను వ్రాసినది కాదేమి? 'చేత్' అధ్యాహారము కాదందురావీరు? కన్యాగర్భః దేవైఃక్షత్రం స్వర్గమనాయ నిర్మితః, అనుటలో ప్రశ్నము సమాధానముకలవు. క్షాత్రము యుద్ధసంబంధము కలదియే. చూడుడిటు—

భూరేణుదిగ్ధాన్నవపారిజాతమాలారజోవాసితబాహుమధ్యాః। గాఢంశివాభిః పరిరభ్యమాణా న్సురాంగనాశ్లిష్టభుజాంతరాఢ్యాః। సశోణితైః క్రవ్యభుజాం స్ఫురద్భిః పక్షైఃఖగానాముపవీజ్యమానాన్। సంవీజితాశ్చందనవారిసేకైః స్సుగంధిభిః పుష్పలతాదుకూలైః। విమానపర్యంకతలేనిషణ్ణాః కుతూహలావిష్టతయాతదానీం। నిర్దిశ్యమానాన్ లలనాంగుళీభిః వీరాస్స్వదేహాన్పతితానపశ్యన్॥

వీరులు యుద్ధములో మరణించి స్వర్గమునకు బోవు చున్నారు. క్షత్రము యుద్ధమందు శస్త్రహతులై స్వర్గమునకు జేరుననియే పెద్దలనుడి. తామై స్వయముగ గొంతుల గోసి

కొనువారికి కావీమాట. యుద్ధహాతులకే జాతి వివక్షలేక యీ సూక్తి చెల్లును—

> మహినాసంద నృపాలు శ్రీవిజయరామస్వామి వాల్పోనికినా
> (స్రి) హుసేన్ ఖానుని మస్తకంబని మొనన్ రెండయ్యె భ
> వ్యాహరిద్ఘోటకమండలంబప్రుడు రంభాకంచుక గ్రంధియున్
> రహి రెండయ్యె.........

ఇది పండితవర్యులు పీఠికాపురాస్థాన విద్వాంసులు కీ. శే. దేవులపల్లి సుబ్బారాయశాస్త్రిప్రణీతము. ఇందు జాతి వివక్ష చేయుటకయే రంభాకంచుకగ్రంధి వీడిపోయినది. క్షత్ర విషయము చెప్పనవసరమేయుండదు. క్షత్రస్వర్గమనమునకు వీరి కన్యాస్పర్శ నిర్మాణమవసరములేదు—తృతీయ పంచమాంశము లలో సంఘర్షణమునకు నాగదమాయింపు జూపిన వీరి ఘర్షణ మునుజూతము. స్పర్ధ - సంఘర్షే = సంఘర్షః - పరాభిభవేచ్ఛా ధాతుపాఠము. సంఘర్షః — స్పర్ధా — సంస్పర్శః = స్పర్ధా — పరప్రతిపీర వివాదః = సర్వశబ్దసంబోధిని — స్పర్ధధాతువుకు సంఘర్షమనుచు, సంఘర్షమునకు — పరాభిభవేచ్ఛ — అర్థమని నాడు. సంఘర్షమునకు సంస్పర్శమర్థమని కొన్ని నిఘంటువు లనినవి. వీరి యర్థముప్రకారము వైరాగ్నివలన దేవతలు సంతానమును గనెదరా? నేను వ్రాసిన కలయిక, యిక్కడ తగదనిన వీరి వైరము తగునా? కలయిక కర్ణాదులలో గలదని 'సన్తిదేవనికాయాశ్చలో' నున్నదా? సామాన్య

బోధక వాక్యముల కట్లర్థమును వ్రాయుట కథకులకు పరిపాటికదా!

ఇట్టి, కువిమర్శ మెవరిదో స్పష్టమగుచునే యున్నది. సమన్వయపద్ధతి నాకు తెలియదని వ్రాసినవారి కామార్గమే దృష్టి నందదని నన్నవచ్చును. నిరంతరమును మారుద్రోవల వడచు వీరి కేసాహిత్యవ్యాకరణాచార్యుల యననుసరణదోషమో తెను వున జనించినది కానోపు. రెండర్థములు కలసంఘర్షమును రెండుచోట్ల నన్వయించి చూడగలరు సువిమర్శకులు-పై కారణముననే శాస్త్రిగారు 'రతి'ని జేర్చిరి కాబోలు! సంఘర్ష జననము వారియర్థము ప్రకారము స్పర్ధను గలిగించినది. కావలెను. 'వైర, అగ్ని, ఉత్, దీపనం, పదముల బలుపెంపులకు? దేవతలు కలిగించు జననము లయిదింటిలో (సంకల్ప, వాక్, సృష్టి, స్పర్శ, సంఘర్షములు) నొకటగు సంఘర్షమే యిటచెప్ప నుద్దేశ్యముకాదు అందురా? భాష్యము, గుహ్యము, దేవరహస్యము, అనునవీసంఘర్ష బాధనొందునవియే. ఈ స్పర్శము, సంఘర్షము వేఱ్వేఱర్థములలో నున్నను నిఘంటువు రెండింటి నొకటిని జేసినది. సంఘర్షము-రాపిడి - ఒరయిక. దానినే శరీరపురాపిడి అనక కలయిక, అనినేనువ్రాసినాను. శాస్త్రిగారు, కలియుటను వాడియేయున్నారు, పాఠకులుచితము నెరిగెదరు కాక, 'పస్పర్శకును' 'సంస్పృశ్య'కును స్పృశించెను, అనియే వ్రాసినవీరు నిఘంటువిచ్చిన సంస్పర్శము నొప్పుకొనరా? లోకవ్యవహారములోని ఘర్షణము - పోరాటము శాస్త్రిగారికి

నచ్చినది. 'స్పర్ధయా వర్ధతే విద్యా, ఇటపరునిమించవలెనను నూహాస్పర్ధ - ఆశ్వమేధికపర్వములోని మరుత్తరాట్చరిత్రమున నీఅభిభవమును జూడండి. శాస్త్రిగారూ? కర్ణార్జుల పట్ల మీరనిన సంఘర్షమతుకును. (వీరప్రతివీరవివాదః) వృద్ధకుమారీతుగాణః అనెదరేమో? 'రజోచిహ్నం' ప్రయోగవైపుణిని వీరాదరింపక ఏకదేశాన్వయాదులతో తమపాండితీపారీణతను వెల్లడించుచున్నారు- వీరి 'క' ప్రత్యయము దేనినానుకొనినదో బయటపెట్టలేకపోయిరి. ఎవరివాదము పరాస్తమో సుమార్గగమనమున గ్రహింపనగును.

## వనపర్వ గ్రంథాక్షేపము

ఈ పర్వము సందర్భశుద్ధిలేనిదని పలువురు పండితులొప్పుకొనినదియే. అతఃకులబాంతగ బెంచబడినదని ఈకుంతీ, కర్ణఘట్టమే స్పష్టపరచును. నేనీఘట్టమున వ్రాసిన 'రాజన్' శబ్దమును గురించి ఆక్షేపించిరి-నేనువ్రాసినది పొసగకపోలేదు. 8 శ్లోకముల వెనుక నున్న జనమేజయు నిటకు దెచ్చిరి. శ్లోకపూర్తికై తెచ్చిన ఈఘట్టమునకిది ఉచితస్థానము కాదు-నేను పొరబాటొందినాననినను గౌరవలోపము కాదు. ఇట్టిదే శాంతిపర్వపు ప్రారంభమునగలదు. సర్వజ్ఞత్వమును బూనుటయు దగదు. ఆశ్లోకపు టునికి నెఱిగియే ఆక్షేపించితిని. ఆవనపర్వభాగపు దుర్గతి జూచినేనద్దాని నాక్షేపించితిననుట నిజమే. ఈరాజన్ శబ్దమును గురించి వ్రాసినది వారిప్రసూతిగర్భధారణములు

వంటిది మాత్రము కాదు - ఊకదంపు వ్రాతకు సమాధాన మిడు టనవసరమైనను తప్పనిసరిగ వ్రాయుట జరుగుచున్నది ఆరణ్యపర్వములోనీభాగము మానవుని కలవరింతలుగ నుండును దేవీభాగవతమున "స్త్రీరూపో వామభాగాంశో దక్షిణాంశః పుమాన్ స్మృతః॥ అనియుండగ పార్వతి సధోభాగమున చిత్రించుట, నరకాత్మ కర్ణునియం దదివరకే ప్రవేశింపజేయుట - ద్రోణభీష్మాదుల కాగ్రహాతిశయనిరూపణము. పార్వతీ పరమేశ్వరులు రాక్షసేష్టానుస్మృతి బ్రవర్తించుట మొదలయిన వన్నియు నేనుజూపిన పిమ్మట నాపైకసి దీర్చికొనిరి. వా రిచ్చిన వనపర్వములోని 252 శ్లోకముల జూచిన పాఠకు లద్దాని గ్రహించెదరు. శాస్త్రిగారూ! పండితుడనని మీరే తలంచుకొనుచున్నారు - ఆధారణిచే నేను నిరూపించితిని.

## నీలకంఠదూషణము

ఇంతవరకు వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భారత తత్త్వకథన పరిశిష్టపరిశోధన మయినది. నీలకంఠ దూషణ మును గురించినేనుకర్ణోత్పత్తిలో వారికిచ్చిన సమాధానము నీలకంఠునికనియు దామాతని కవలంబముగ నుండుచున్నా మనియు దెలుపుచు గొంతవ్యాఖ్యమును చేసిరి. నేనువ్రాసిన కర్ణోత్పత్తిలో గొన్నివిషయముల కుపపత్తిదొరకక వదలు కొనినారు. తామిచ్చిన సమాధానములకు బలముకలదను నూహతో బిభీషికను నెఱపినారు. చూడుడు. పాఠక

మహాశయులారా? నీలకంఠునివే అనుకొనిన పొరబా ట్లుగ నేను జూపించినవి (వీరుసమర్థించి పొరబడినవి) తస్మై స్యసప్రదదౌ మంత్ర మాపద్ధర్మాన్వవేక్షయా, ఆది 105 పరిశిష్టము 70 పేజిలోని పైశ్లోకములో వరము మాటలేదని నారు "యంయందేవం త్వమేతేన మంత్రేణా వాహయిష్యసి, తస్యతస్య ప్రభావేణ తవపుత్రో భవిష్యతి." ఆది — 111 అ — వరం విద్యాంచ వ్యత్రహాన్ = ఈవిద్య మంత్రముకదా? వరమేమిటి? మాధవి తానే రాజులనుగూడుచు వచ్చినదగుటచే కన్యాత్వ సిద్ధియే వరమైనట్లు దేవతాహ్వానమునకు మంత్ర మును కన్యాత్వమునకు వరమును యిచ్చినట్లు స్పష్టమగు చున్నది. 70 పేజిచివర 71 మొదటజూచిన దుర్వాసుని శక్తిని విశిష్టమైన దానినిగ జెప్పిరి. కానికన్యాత్వదానము నకు మాత్ర మాతడు కర్తకాగూడ దనుచున్నారు. వర ములో నదికలదా యనినేనడిగిన దంచులకే! వీరుచెప్పిన వన్నియు వరములోనున్నవా? వరములో పాండవుల ఆయుర్వి షయమున్నదా? భారతమున గలదుకదా వీరుచూడలేదు. శాస్త్రిగారి వివరణము వ్యాఖ్యను చూపుచున్నాను. ఆపద్ధర్మ— ఆపత్స్వభావముయొక్క, భావిసంతాన ప్రతిబంధముయొక్క— అన్వవేక్షయా, అనాగతవిషయజ్ఞానముచేత (అని) వివరణము, భావిసంతానప్రతిబన్ధస్య,ఆపద్ధర్మాన్వవేక్షణేన అని నీలకంఠుడు. సంతానప్రతిబన్ధమెట్టిదో.నీలకంఠుడుకాని శాస్త్రిగారుకాని చెప్ప లేదు. ఆదిపర్వము 103 అ, ఆపద్ధర్మం త్వమావేక్ష్యవహ పైతా

మహాంధనం। ఆపద్ధర్మమునాలోచించి పితృపైతామహమైన రా
జ్యమునువహింపుము. సత్యవతి మాటలివి—"ధర్మాదపేతం బృవ
తీం భీష్మోభూయో బ్రవీదిదం। రాజ్ఞి ధర్మానవేక్షస్వ మా న
స్సర్వాన్వ్యనీనశః" సత్యాచ్చ్యుతిః క్షత్రియస్య నధర్మేషు ప్రశ
స్య తే। శంతనో రపిసంతానం యధాస్యాదక్షయం భువి, తత్తే
ధర్మం ప్రవక్ష్యామి క్షాత్రంరాజ్ఞి సనాతనమ్। శృత్వా తం ప్రతి
పద్యస్వ ప్రాజ్ఞైస్సహాపురోహితైః ఆపద్ధర్మార్థకుశలై ర్లోక
తంత్రమవేక్ష్యచ॥ ఆపద్ధర్మవిషయము భీష్ముడుకూడ నుడివినాడు
సత్యవతినుద్దేశించి "న తేశక్య మనాఖ్యాతు మాపద్ధర్మం
తథావిధం" ఆపద్ధర్మమం దీధర్మ మవలంబనీయమని తత్ప
దార్థము — ధర్మమునకు స్వభావ మర్థమని యుండనోపు.
ఇటచెల్లదు. భారతశాంతిపర్వమున ఆపద్ధర్మపర్వములను పేరున
గలవానిని జదివిన నదివ్యక్తము కాగలదు. ఛాందోగ్యోపని
షత్ లోని ఉచఘ్న్యుని చరిత్రను జూచిన నీఆపద్ధర్మస్వభావము
తెలియగలదు. ఏవం తద్వైవాపది లింగమేతద్ధర్మాధర్మానత్వే
వృత్తిభవేతాం। ఆద్యంలింగం తస్యతస్య ప్రమాణాం ఆపద్ధర్మం
సంజయ తన్నిబోధ "అసత్యా మాపది కర్మ నివర్తమానో
వికర్మస్థః సంజయ గర్హ్యయే తమ్" లుప్తాయాంతు ప్రకృతే
యేన కర్మ నిష్పాయతఃతత్త్పరీప్సే ద్విహీనః" ప్రకృతి శ్చాపది
వర్తమాన ఉభౌగర్హ్యౌ భవతః సంజయే తే॥ కామినీషు వివా
హేషు గవాంభక్తేతథైవచ। బ్రాహ్మణాభ్యుపపత్తౌచ అనృతే
నాస్తిపాతకమ్। స్త్రీషు నర్మ వివాహేషు వృత్త్యర్థే ప్రాణసంకటే,

గోబ్రాహ్మణార్థే హింసాయాం నానృతం స్యాజ్జుగుప్సితం విశ్వామం దేవివషయమును వానినుండి తప్పించుకొనజాలదు. ఆపద్ధర్మమని ఈనగ్న సత్యమును దాచిపెట్టుటేల? "ధారణా ద్ధర్మమిత్యాహుః ధర్మోధారయతేప్రజాః। ధర్మేణైవజగత్సు రక్షితమిదం ధర్మోధరాధారకః" సత్యధర్మములు ప్రకృష్ట ములయ్యెను. కాలానుసరణములని భారతము చెప్పుచున్నది. ఆపదః - ధర్మః అనిఅన్వయము. ఆపది యోనుసరణీయః ధర్మః అనిఅన్వయము. "మృగవ్యవాయ నిధనా తక్కృచ్ఛ్రం ప్రాపస ఆపదమ్" జన్మప్రభృతిపార్థానాం తత్రాచారవిధి క్రమః। మాత్రో రభ్యుపపత్తిశ్చధర్మోపనిషదం ప్రతి । ఆది ప్రథమాధ్యాయము. మాత్రోరితి, చశబ్దో హేతౌ" యస్మా ద్ధర్మోపనిషదంప్రతి. ధర్మః కులస్త్రీభిః ఆపద్యపత్యార్థే విశిష్టః పురుషాన్ ప్రార్థనీయ ఇత్యేవంరూపః-వ్యాసవశిష్ఠాదిభ్యో పత్యవత్యువిచిత్రవీర్య కల్మాషపాదాది రాజదారేషు దృష్టః. తస్య సంరక్షణార్థా ఉపనిషత్. దుర్వాససా దత్తావిద్యా తాంఆవర్తితా-ప్రతిమా త్రోః మాతరాప్రతి, అభ్యు పపత్తిః రేతస్సేకార్థంగమన ముపపన్నమేవ"ఇక్కడ ఆపద్ధర్మ శబ్దము నేకముగ జెప్పుట సంగతము. ఆపద్ధర్మములోవలె అనుసరించతగినవి కాకుండిన నాకథలన్నియు సంబంధములేని వగును. ఆపన్నివారణానంతర మీధర్మమనుసరించిన నధర్మమే యగును. అన్వేక్షణ మనాగతవిషయమున కనికథకుల నిర్వ చనము. సభాపర్వము 18 అ-భోజనావేక్షణేచైవ యుయుత్సుం

సమయోజయత్" అవేక్షణాన్వేక్షణములు సమానార్థక ములే. బాగుగ ఆలోచించి అనుట తగును. యథా అస్యాః పృథాయాః శ్రేయోర్థ మవధానేన సమాధికాలే యత్న మకరోత్ - యత్నేన తస్యాః కళ్యాణం చింతితవాన్ ఇత్యర్థః ఆపద్ధర్మ మవేక్ష్యచ। అనిపైన రెండుచోట్ల నున్నది. చూచి, అనుట మాత్రమేకాదు - 71 పేజీలో గన్యాత్వమున సంతతినిగనుట ఆపత్తు అని వ్రాయబడినది. కానిచో మహా భారతము కన్యాత్వే దూషితేత్యాది నూఱ్ఱుకొలది శ్లోకము లతో శోకించుటేలనో? సూర్యాపరాధజత్వాత్ హాసః అని నీలకంఠుడనుటెట్లు? కుంతిపరితాపమేల? వ్యాసునూరడిం పెందులకు? అవేక్షమాణ, అవధానేన సమాధికాలే చింతిత వాన్. ఈమాటని అన్వేక్షయా దగ్గరకు గొనిపోయి పరిశీ లించి చూచిన శాస్త్రిగారికాపద్ధర్మ మన్వయమగును. కుంతికి శ్రేయోదాయకమగునని దుర్వాసుడు వరవిద్యల నిచ్చినాడు. ధర్మస్య జననీ భద్రే భవిత్రీ త్వం శుభాననే। వశేస్థాస్యంతి తే దేవాః యాం స్త్వమావాహయిష్యసి। ఏ దేవత నీమంత్రముచే నాహ్వానించెదవో ఆ దేవతనీకు లొంగియుండును. అనియుం డియు గన్యాత్వమున సంతానమును గనినయెడల గలుగు నాపత్తును (జానతీచాప్యకర్తవ్యం కన్యాయా గర్భధారణం) తొలగించు పునఃకన్యాత్వస్థితి సిద్ధినాలోచించి యిచ్చినాడని - అవధానేన, కళ్యాణం చింతితవాన్ - అనుదానివలన దెలియు

చున్నది. పృథాయాః శ్రేయఃప్రాప్తికం (కల్యాణం) అని అన్వయము కానివివాహము గానేరదు పరి 72 పేజి.

## ఘటపటసాదృశ్యము

తర్కమున మేము పారీణుల మనుటకు ఘటపటములు సిద్ధించినవి. వారి వాక్యమిది 'ఘటాయోన్మీలితం చక్షుః పటం సహీనపశ్యతి' అని న్యాయము. ఘటమును జూచుటకు తెరచిన కన్ను ఘటమునే చూచి తత్ప్రాంతమునందున్న పటమును జూడకుండ నుండజాలదు—అట్లే కుంతి వ్యవహితభవిష్యత్తును గ్రహించుటకేర్పడిన మునియొక్క యోగదృష్టి సన్నిహిత భవిష్యత్తును గ్రహింపకుండ నుండదు. కనుక మునియొక్క ఆపద్ధర్మాన్వేషు పాండవోత్పత్తికి చెందినదిగా జెప్పబడినను, గర్ణోత్పత్తి అర్థాత్సిద్ధమగును — అని సన్నిహితభవిష్యత్తగు కన్యాత్వమును ముని యిచ్చుటకొప్పుకొనని శాస్త్రిగారు వ్యవహితభవిష్యత్తునొప్పుకొనుచున్నారు. వారు 'చెప్పబడినను యద్యపి' అనవలసివచ్చినది. 'పటాయోన్మీలితం చక్షుఃఘటం హీనపశ్యతి' అనిన నేమందురో? పటము పెద్దదై ఘటముచిన్నదయినచో నట్లే కావలెను. దేనిని జూడదలచెనో దానిప్రక్కనున్న చిన్నదానినైనను చూడవలసివచ్చును. పైన్యాయపండితునికి ఘటము పెద్దది (గూన అందురు), పటము చిన్నది (అల్పవసనము) తోచిన దేలనో? కుంతికిచ్చినవరము గ్రహింపు ప్రధానముగ నేర్పడిన యోగదృష్టియా? ఫలితజ్యోతిషము

కాదది. భవిష్యతి నభవిష్యతివా అనుటకు. వరమెప్పుడును రాబోవువానినే చెప్పునుకదా? యువతికి సంతానప్రాప్తి సంతోషదాయకము. సంతానము కలుగుననియే యాతని వరముకదా? సంతానవాంఛ నాతడు గ్రహించినా డనుటను శాస్త్రిగారంగీకరించనిచో మునియోగదృష్టి వ్యర్థమునుజేసిన వారగుదురు. సన్నిహితమును జూడక వ్యవహితమును ముందు చూచుట కలుగదని వారే అనుచున్నారు. యువతి, ఉపచార జనితానుగ్రహప్రాపిత "ఆమ్రపుష్పోపమా యస్య నివృత్తి రుపలభ్యతే – నచాండముపజాయతే॥ అనురీతిని వ్యర్థము కావచ్చును.

ఎట్టిఆపత్తు వచ్చినను ఉపయోగించుకొనదగు సంతాన ప్రద యువకాకర్షణవిద్యనిచ్చినాడు-కథకులు 71 పేజీ ద్వితీయాంశములో వ్రాసినదంతయు కుయుక్తిబాహుళ్యము కాని అన్వయ శుద్ధి కలదికాదు. ఘటం భింద్యా త్పటం ఛింద్యా త్కుర్యాద్వా గార్దభస్వరం యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవేత్॥ అనునట్లు ఘటపటగ్రహణము చేయుటతగదు. ఇట ధర్మజుని మాత్రమే కుంతి కనినయెడల అనౌచితి కన్పించదు. "యాంస్త్వమావాహయిష్యసిలో ఘటపటన్యాయము లేదా? దానినే నేనెత్తిచూపించినది. వరమనజరుగబోవుదానిని సూచించుటయేకదా, ఔచితీభంగమని నేనెట్లనగలను? 73 పేజి 2 పేరా - కుంతిని పితాపుత్రులు కలియుటతప్పని వ్యాస

నీలకంఠు లనలేదేమని నేను వ్రాయగ చర్విత చర్వణము జేసి కొని నాపాండిత్య ప్రకర్షమువారికి మూలచ్ఛేదమయినదనుచు దలకుదగని టోపీని దగుల్చుకొనిరి. అట్లు చేయవచ్చునని వ్యాసుడే చెప్పెననిరి. తప్పనకుండుట తగదనియే నేననినదానిని గమనించరైరి. సమాధానముగ ఎక్కడనో స్వవచన వ్యాఘాత ముగ పితాపితృలు కలియకూడదని వ్యాసుడు చెప్పినాడనిరి. 'మనుష్యధర్మో దైవేన ధర్మేణనహిదుష్యతి' అని చెప్పినా డనుటయేకాక పురాణవర్త్మగమనమను వాక్యమును, ఆదిపర్వ శ్లోకములకు నీలకంఠుడు వ్రాసిన వ్యాఖ్యాగత శ్లోకములని యర్థమిచ్చు మూడు శ్లోకములనిచ్చిరి. పై వాక్యములో "మనుష్యధర్మముచే దైవధర్మము దోషింపబడదు" అని యున్నట్లర్థము చెప్పబడుట దోషము. ఒకరి ధర్మముచే నొకరిధర్మము దోషింపబడుట తగదు అనియే దాని భావము కాగలదు. వ్యాసుడే దేవతలకు వ్యభిచారదోషము లేదనియు, పాపమంటదనియు, కావున నరులు యజ్ఞాదులొనరించి దేవతలగుటకు యత్నించవలెననియు చెప్పెనా? ఇట్టిదేనా! వ్యాసుని బ్రహ్మసూత్రధోరణి? ఈ శ్లోకములు వ్యాసునివా? నీలకంఠునివా? ఏప్రతి ఆదిపర్వపు 12 పుటలోనివీ శ్లోకములు? పై పితాపుత్రసంగమము దోషమని యెంచుటచే నివి వ్యాసుని వని యెంచవలెను. ఇటు చూడండి పాఠక మహాశయులు. యముడు ధర్మస్వరూపుడట. ఋ ౧౦ అ - సూ ౧౦ మం ౧౦-
"ఆఘాతా గచ్ఛానుదాత్తా యుగాని యత్ర జామయఃకృణ

న్నజామి ఉపవన్వ్రుహి వృషభాయ బాహు మన్యమిచ్ఛస్వ సుభగే పతిం మత్." యమియనుశామె తనయన్నయగు యముని భర్తగా గోరగ యము డనుచున్నాడు. ఇంకను పాపమయమగు కలియుగము రాలేదు. అప్పుడు చెల్లెండ్రు అన్నలను సహితము కామించెదరు. నీవు మఱియొకరిని వివాహమాడుము. కుంతిని యముడు తల్లిగ నెఱుగడందురా? ఈ న్యాయమేమయినది? ఇటగుంతి మనుష్యజాతిది. సూర్యుడు దేవజాతివాడు. కావున గుంతిని చెఱుచుట దోషముకాదని వ్యాసుని భావమా? అట్లే మనుష్యజాతిదగు నహాల్య నింద్రుడు చెఱచుట దోషముకాదు. ఋషిపత్నియగు రుచీ దేవినట్లే చేయబూనిన ఇంద్రుని జూడగలము. గౌతముడు దేవజాతిధర్మమగు వ్యభిచారముసేయ పాల్పడిన ఇంద్రుని న్యాయసంగతుడని తెలిసియు తనధర్మసూత్రములకు వ్యతిరేకముగ "అనార్యజుష్టేన పథామహేంద్రః" యనుచు 'భగాంగ పరిచిహ్నితోభవ' యనిశపించుట తగునా? 'అఫలోస్మికృతస్తేన' అనియు ఇంద్రస్తుమేష వృషణః అనియు ప్రసిద్ధి నొందజేయుటేలనో? తనభార్య కావుననట్లు జేసెనేమో! "అస్యాపరాధత స్త్వింద్రో యోనిసాహస్ర దేహభాక్। క్లీబోభూన్మష్కనాశశ్చ హాస్యపాత్రందివౌకసాం" కేదారఖండము 17 అ. రుచీదేవి ఇంద్రునిట్లనును. "అమహో స్మీతి దుర్బుద్ధిం సమాస్థాయప్రవర్తసే॥ పైపురాణవర్త్మ శ్లోకమున కిది వ్యతిరేకము. గౌతమేనాసియన్ముక్తః భగాంగ

పరిచిహ్నితః । కిన్నుతద్విస్మృతం – నతన్మనసి తేస్థితం” చక్కని పాదరక్షాప్రయోగము. ఇవన్నియు మనుష్య సంబంధి ధర్మములందు రేమో కథకులు! తారదేవజాతిది, చంద్రుడు దేవజాతివాడు. వారిసంయోగ మాక్షేపింప బడలేదు. దేవ కృత్యము కావున తారపంచ కన్యలతోజేరె పతివ్రత అయి నది. “పంచకన్యాః పఠేన్నిత్యం మహాపాతక నాశనం” ఇరువురు దేవజాతివారే కావున సర్దుబాటు చేసికొనిరి కాబోలు! కాకుండిన చంద్రపుత్రుడగు బుధుని “గృహే ప్రచ్ఛన్న ఉత్పన్నః గూఢజస్తు సుతస్స్మృతః” ‘అగ్ని.పు’ వదలి, భార్యను గ్రహింపడు దేవగురుడు. అన్నయగు ఉతథ్యుని భార్యను చోరత్వమున రమించుట సధర్మమనిరా దేవతలు?

దీని నుట్టంకించి ఎత్తిపొడిచెదరనియే తారాగ్రహణము చేసినాడు. ఉతథ్యుని భార్యయగు మమతకు దోడికోడలే కదా తార! దేవధర్మము నాక్షేపించుటకు మనుజులకు దావు లేదనినాడట వ్యాసుడు! దేవతలకు మనుజులు హవిస్సులనొసగి తిండిమాత్ర మొసంగుచుండవలెననినాడా! ఏమి ధర్మనిర్వ చనమిది! న్యాయపారీణులు చెప్పినమాటలయందు మనుజులు నమ్మకముంచక తప్పదా? దేవజాతి ఎంతనీచముగ బ్రవర్తిం చినను దోషములేదనుసూత్రము ననుసరించియే నరులు దేవతా పూజాదికమును జేయుచున్నారని యూహించవలెను. యజ్ఞాది క్రతుఫల మీపాటిదా! ఇట్టివి పురాణనిక్షిప్తములు చాల

కలవు. ధర్మమందరకు నొకటియే. తలకొకధర్మమగుచో తద్ధారవము నశించియే యుండును. ఆపద్ధర్మములని కొన్ని యేర్పడుట ధర్మశబ్దమునకు గల గౌరవమును నిలబెట్టుటకని మనము తెలిసికొనవలెను. చర్వితచర్వణమగు నీవిషయము నింతటితో వదలివేయుచున్నాను.

## కామయా

కామయా :—సర్వసేన, అను నీలకంఠుని వ్రాత సరి అయినది కాదని నేనంటిని. "ఏతదిచ్ఛామి విజ్ఞాతుం తత్త్వేనహి మహామతే। కామయాబ్రూహి మే సర్వం సత్యేన ప్రయతాత్మనా॥ పై "కామయా సత్యముచ్యతాం" సమానములే. క్రింద గీట్లుంచబడిన పదముల జూడవలెను. కామయాను బలపరచునవి. కామయా, నిరాక్షేపము, అడ్డులేక, భయపడక కాదా! శాస్త్రిగారు వ్రాసినదంతయు నిస్సారము. కావున వీరే త్రోసివేయబడిరని పర్యవసానము.

## పాదౌ నధావయే

'పాదౌనధావయే'కు కర్ణుడు వెనుకంజవేయను అనినాడని నేనంటిని. శాస్త్రిగారు ఇతరులచే పాదములు కడిగించుకొనునను నీలకంఠుని వ్రాతను బలపరచుచు నాలుగు పుటల గ్రంథమును వ్రాసిరి. కవిసార్వభౌముల 'కాళ్లుల్ధావనమాచరింప, నను పద్యభాగము నుదహరించిరి. అట ఆచరింప, కర్తృత్వము

కర్ణునియందే కలదు. కాళ్లుల ధ్రావనమాచరింప ననినప్పుడు పారిపోవుదను నర్థములేదా! పాదా - కాళ్లులన్ - నధావయే' ధావనమాచరింప॥ సరియగు ననువాదము. కర్ణపర్వమున యుద్ధమునుండివచ్చిన యర్జునిని ధర్మరాజిట్లనును "నాహంపాదా ధావయిష్యే కదాచిద్యావత్ధ్రీతః పార్థయిత్యల్పబుద్ధేః । వ్రతం తస్మైతత్సర్వథాశక్రసూనో కచ్చిత్త్వయానిహతస్సోద్యకర్ణః" ఈశ్లోకములోని 'నాహంపాదాధావయిష్యే - ఇత్యస్య వ్రతం, అనిన యుద్ధభూమిలో. పరునిచే కాళ్లు కడిగించుకొనుచుందు వ్రతమా! "యస్యచైతద్వ్రతం మహ్యంవధే కిలదురాత్మనః మృషాకృత్వా వ్రతంతస్య పాపస్యమధుసూదన । పాతయిష్యే రథాత్కాయం శరైస్సన్నతపర్వభిః॥ యుద్ధభూమిలో కర్ణుడు పరులచే కాళ్లు కడిగించుకొనుటనే చెప్పినాడా అర్జునుడు? వెనుకంజవేయించి తీరెదనని చెప్పదగినది. పండితులార! శాస్త్రిగారి పదధావనమునుచూడండి. 'ఆహూతోననివర్తేయమితి తేన వ్రతం కృతం, కర్ణుకు యుద్ధపరాఙ్ముఖత్వము నొప్పుకొనడని స్పష్టమగుచున్నదికదా! "యఆహవేషువధ్యంతే భూమ్యర్థమపరాఙ్ముఖాః" 'యాజ్ఞవల్క్యస్మృతి, - 312వ శ్లోకము. అక్షయోస్తు' రణేష్వపరాఙ్ముఖానాం,= కర్ణభారము= ఫెర్గూసన్ కాలేజి ప్రొఫెసరు C. R. Devadhar M. A గారు ముద్రించినPlays inserted to Bhasa-Poona oriental series No 54. "ఆహూతోననివర్తేయమితి తేన వ్రతం కృతమ్" ద్రోణ-అ 183- ఈవెనుకంజ వేయను, అను కర్ణుని

వ్రతము ననుసరించి జరిగినదంతయు జూడగలరు. పాఠకులు నేనుకర్ణోత్పత్తిలో నీలకంఠుడు "శంనోదేవీ" నెరిగియుండు నేమో యనినాను. నథావయే విషయమున్న భారతభాగము లను వదలి 'పరేణ, అనుట తప్పని యెంచి నేనునీలకంఠుని పరిహాసించితి ననుకొనుడు — ఈకథకులకు కలిగిన బాధ యేమి? పాపమాసమయమునకు శాస్త్రిగారికేమి జ్ఞప్తికి వచ్చినదో కదో? నన్నిట్లు నిందించుచున్న ఈతనిజూడవేమి యని నీలకంఠు నాత్మ శాస్త్రిగారినెంత వేధించినదో కదా! శాంతంపాపం. నన్నుబ్రాహ్మణార్థముల చేయుటలో నాయాధు ననిరి కథకులు. బ్రాహ్మణార్థగ్రహణము నెరుగక బ్రాహ్మణ వ్యతిరిక్తార్థగ్రహణము చేయుచుండు వారగుట నట్లువ్రాయుట వారికితగినదియే. వీరింట బ్రాహ్మణులను నైమిత్తికశ్రాద్ధము లందు నియమించరోటు. బ్రాహ్మణులయిండ్ల భోక్తనై పర మార్థమును బొందుట దోషమని బ్రాహ్మణుడనగు నేనను కొనలేను. నథావయే యనుచు శాస్త్రిగారెంతదూరము నడచి శ్రమించిరో? పదధావనము చేసికొనుడు శాస్త్రిగారూ? ఈవెనుకడుగువేయననుచు కర్ణుడనిన కథావివరమును జూడ గలరు పాఠకులు.

కృష్ణుడు :

1. కర్ణమాసాద్య సంగ్రామే దిష్ట్యాజీవతి ఫాల్గునః।
సవ్యసాచివధాకాంక్షీ శక్తిం రక్షితవాన్సః।
నచాగా ద్ద్వైరథం జిష్ణుః ఇష్ట్యాను భరతర్షభ।

సృజేతాం స్పర్థినావేతౌ దివ్యాన్యస్త్రాణి సర్వతః
వధ్యమానేషు చాస్త్రేషు పీడిత స్సూతనందనః
వాసవీం సమరేశక్తిం ధృవంముంచేద్యుధిష్ఠిర ॥

ఈవిషయమున ముందు వెనుక లరయుదము. శల్యునితో ధర్మరా జిట్లనును.

2. రాజన్నకర్తవ్యమపి కర్తుమర్హాసి సువ్రత.
మమత్వాపేక్షయా వీర శృణు విజ్ఞాపయామి తే
కర్ణార్జునాభ్యాం సంప్రాప్తే ద్వైరథే రాజసత్తమ.
కర్ణస్యభవతా కార్యం సారథ్యం నాత్ర సంశయః
తత్రపా ల్యోర్జునో రాజన్ యదిమత్ప్రియ మిచ్ఛసి
తేజోవధశ్చ తే కార్యః సౌతే రస్మజ్జయావహాః
తత్ర తేజోవధః కార్యః కర్ణస్యార్జునసంస్తవః
సూతపుత్రస్య సంగ్రామే కార్య స్తేజోవధ స్త్వయా ॥
ఉద్యోగపర్వము.

ధృతరాష్ట్రునితో సంజయు డిట్లనెను.

3. నరర్షే ద్యది కృష్ణ స్తం కర్ణాత్ పార్థం మహారథమ్. సాశ్వధ్వజరథ స్సంఖ్యే ధృతరాష్ట్ర! హతోభవేత్। హన్యాత్ క్షిప్రం హి కౌంతేయ శక్తిం వృక్షమివాశనిః, న హ్యేన మైచ్ఛత్ప్రముఖే సౌతేః స్థాపయితుం రణే। ఘటోత్కచే

వ్యంసితాం తద్దృష్ట్వాతాం నరపుంగవ। మృత్యోరాస్యాంతరా న్ముక్తం పశ్యామ్యద్య ధనంజయం । మృతం ప్రత్యా గతమివ దృష్ట్వా పార్థం ధనంజయం.

కృష్ణు డొకప్పు డిట్లనును.

4. ప్రజ్వలంతీ మహోల్కేవ తిష్ఠత్యస్యహి వాసవీ। త్వదర్థం పూజ్యమానాసై రక్షతే పరవీరహన్ । అతఃకర్ణం ప్రయాత్వత్ర సాత్వతస్య యథాతథా । అహం జ్ఞాస్యామి కౌంతేయ కాలమస్య దురాత్మనః । యత్రైనం విశిఖై స్తీక్ష్ణైః పాతయిష్యసి భూతలే। గాండీవ ముద్యమ్య భవాన్చక్రం చాహం సుదర్శనం । నశక్తాస్స్యోరణేజేతుం తథాయుక్తం నరర్షభం. ఏకోహియోగోస్య భవేచ్ఛిధాయచ్ఛిద్రే దేహ్యేనం స్వప్రమత్తః ప్రమత్తం। కృచ్ఛ్రప్రాప్తం రథచక్రేనిమగ్నే హన్యాంపూర్వం త్వంతుసంజ్ఞాం విచార్య”

కృష్ణుడు మఱొకప్పు డిట్లనెను.

“ఇదియొక్కటే మార్గము.కర్ణునిచంపుటకు! ప్రమత్తుడైన నీతని నప్రమత్తుడవై సందుజూచి చంపవలెను. రథ చక్రము భూమిలో ఇరుకుకొనినప్పుడు నీవుమూర్ఛనుండిలేచి కష్టపడుచున్న కర్ణునిజంపుము.” (1) సం: కర్ణునితో యుద్ధము నకు దిగిన అర్జునుడు భాగ్యవశమున జీవించెను. అర్జునునివధ కొఱకు శక్తిని జాగ్రత్తజేసినాడు కర్ణుడు. కృష్ణుడు కర్ణునెదు రుగ నర్జును నుంచుట కిష్టపడడు. కర్ణార్జునులిరువురు స్పర్థతో

దివ్యాస్త్రములను బ్రయోగించియు నాయస్త్రములు నిష్ఫలములుకాగా దెబ్బతినిన కర్ణుడు ఇంద్రదత్తమైన శక్తి నర్జును వధకై వదలగలడు.''

(2) ధ : శల్యా! చేయఁగూడనిదైన నొకపనిని నన్నుజూచి యైన చేయుము. కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధము పొసగినప్పుడు నీకు గర్ణసారథ్యము సిద్ధింపకతప్పదు. నాప్రియమునుగోరు నీవు అర్జునునిరక్షింపుము. కర్ణుని కపజయము కలుగునట్లు పార్థుని పొగడుచు కర్ణునికి విసుగు జనించునట్లు చేయుచుండుము. ఇదినాకు నీవుచేయదగిన ఉపకారము.

(3) సం : కృష్ణుడు పార్థునప్పట్టున రక్షించుచుండనిచో గుఱ్ఱములతోను రథముతోను ధ్వజముతోను చనిపోయియుండును. అర్జునుని పిడుగు వృక్షమునువలె కర్ణుడు నశింపుజేసియుండును. కృష్ణుడందువలననే కర్ణునెదుర నర్జునుని పెట్టకుండెను. -ఆశక్తి ఘటోత్కచు నెడల బ్రయోగింపబడి నశించగ జూచి పార్థుడు మృత్యుముఖమునుండి తప్పించబడినవానిగ జూచితిని. చచ్చిన వాడు తిరిగివచ్చిన ట్లాయిన దర్జునునికి.

కృ : (4) నీవధకొఱకు కర్ణుడు దాచిన ఇంద్రశక్తి యుండుచున్న కొలకంచువలెనున్నది. అందువలన కర్ణుని సాత్యకిమీఁదకు బోనిమ్ము. అర్జునా! కర్ణునిమృత్యుకాలము నేనెరుగుదునులే. అప్పుడు తీక్ష్ణబాణములచే నాతని నీవుచంపగలవు. ఇప్పుడు చక్రధారినై నేనుకాని గాండివమునుపూని నీవుకాని కర్ణునేమి

చేయుటకును శక్తులముకాము. యుద్ధమందాతనిజయింప లేము.

ఈకథనమును గథకులు సరిగజెప్పజాలినచో గథ యడ్డు తిరుగునేమో ?

## కీలాలజం

మధుమాంసఫలైర్జీవన్ హిత్వా మునివదామిషం। రామా–అత్ర ఆమిషశబ్దేనసూదైస్సంస్కృతంమాంసముచ్యతే, కేవలమాంస స్వీకారత్యాగస్యోత్తరత్రవక్ష్యమాణత్వాత్. గోవిందరాజీయ వాఖ్య. "ఆమిషశబ్దేనసూదైస్సంస్కృతం మాంసభక్ష్యభోజ్యాధికం లభ్యతే. 'ఇదంమేధ్యమిదం స్వాదు నిష్టప్తమిద మగ్నినా' ఇతి ఉత్తరత్ర కేవలమాంసస్వీకారత్యాగస్య వక్ష్యమాణత్వాత్॥ తీర్థీయవాఖ్య. ఆమిషమన పాచకులచే దయారుకాబడినదట. కేవలమాంసముకాదట. కీలాలజం మాంసం అనునర్థమును నేను కాదనలేదు—ఘనీభూతం-గడ్డకట్టినది. రుధిరం కుదపకట్టినది తప్పనినాను. మాంసమనేకరూపభక్ష్యభోజ్యములుగ సిద్ధపరచుకోవచ్చును. కథకులపరిశిష్టము 81వ పేజీ చివర పేరాలోనివ్రాత సరిఅయినదికాదు. పైరామాయణవచనములు 'దుష్కరంహి రసజ్ఞానే మాంసస్య పరివర్జనమ్'—భా. ఆప 115 శ్రీశాస్త్రిగారిని దృష్టిపరచగలవు.

## కరిష్యేచాసురవ్రతం

బ్రహ్మచర్యాత్పరం తాతమధుమాంసం
నివృత్తా మధుమాంసేభ్యః

నివృత్తాశ్చైవ మద్యేభ్యః-మధువన మద్యమని కొందరు "మధుమద్యే పుష్పరసే" మేదిని. మద్యమును గ్రహింపనను నర్థము పనికిరాదని కొందరాక్షేపించిరి. క్షత్రియులకు కొన్ని మద్యములు పానార్హములే యగును. ఇటమధువన తేనెకాదు.

పైష్టికం తాళజం కైరం మాధుకం గుడసంభవం
తృతీయాదిత్రివర్ణానాం మానవైః పేయ ముచ్యతే
స్త్రీణామపి తృతీయాది పేయం స్యాద్బ్రాహ్మణీంవినా
అభర్తృసన్నిధౌ నారీ మధుపం పిబతి లోలుపా॥
ఉన్మాదినీతి సాఖ్యాతా తాం త్యజేదంత్యజామివ-
బ్రహ్మాండపురాణము

పనసాదిజన్యం మదకారణ ద్రవ్యమ్ మద్యమ్
పిష్టాదిజన్యో ద్రవద్రవ్యస్య విశేషస్సురా=పరాశర
సంహిత వాఖ్య

బృహస్పతి మతమనబడు చార్వాకమతపు సూత్రములో "తేభ్యశ్చైతన్యం కిణ్వాదిభ్యో మదశక్తివతీ-సురా= ప్రకృతిద్రవ్యం-కలదు.

శార్కరంబు సూనజంబు గుగ్గుసుమధృతజంబు
నారికేళంబు మాద్వీ
కంబు ఫలమయంబు గౌడ దాళమయంబు నాదిగాతనర్చు
నాసవములు
రుక్మాందచరిత్ర 3-227

మదశక్తిని గలిగించు కిణ్వమను సురను కర్ణుడు విడచి యుండును.

'నాస్తీతినైవ వక్ష్యామి యాచితో యేనకేనచిత్'

అరణ్యపర్వమున గుంతలాహరణపర్వమున గుంతీకర్ణసంవాద మును జూచిన నిది తెలియగలదు. కర్ణోత్పత్తిలో నేను వ్రాసిన భవిష్యత్సూచనము స్పష్టమగును. ఇది ఔచితీయుతము కాదంటిరని. ఇదివరకు లేదనుచుండువాడా కర్ణుడని ప్రశ్నించిరి. ఆతనినీచతనే తమపాత్రమున నిండించిన వీరినడిగెడిదా ప్రశ్నము. కర్ణపక్షపాతిని నేనట్లు చెప్పుటయెట్లు? అట్లను వాడు కాదని యాతని జీవితము చెప్పుచుండగ నిటనట్లు చెప్పించుటచే ముందు జరుగబోవు కుండలాహరణమే సూచిత మని నాఅభిప్రాయము. కర్ణుడుచనిపోయినపిమ్మట ధర్మరాజు మాటలివి.

దదానీత్యేవ యోవాచం నాస్తీత్యర్థితో ర్థిభిః - భారతము

"కర్ణస్య మందిరం రమ్యం బ్రహ్మఘోషసమన్వితం
మయూరశూన్యం కృతం తచ్చ సాంప్రతం దానవర్జితం
యత్రార్థినాంగణాః నిత్యం లబ్ధ్వా మానం తథాధనం
కర్ణావశ్రూణి ముంచంతి తత్ర శోచంతి శోకజం॥

జైమినిభారతము.

కుండలాహరణపర్వము 299 అధ్యాయములో స్వప్నమున ఎదుటబడిన సూర్యుని కర్ణుడిట్లనును "ననివార్యో వ్రతాదస్మా

దహంయద్యస్మి తే ప్రియః। వ్రతం వై మమలోకోయం। వేత్తి కృత్స్నో విభావసో।యథాహంద్విజముఖ్యేభ్యః దద్యాంప్రాణానపి ధృవమ్।నాస్తీతి నైవక్ష్యామి॥ ఈశ్లోకములు బలపరచునవేకదా. స్వప్నగతమగు వృత్తాంతమును సూర్యునితో నివేదించుకొనెను. ఆరణ్య - 310 అ - విదితో దేవదేవేశ ప్రాణేనాపి మహాప్రభో। నతున్యాయ్యం మయాదాతుం...త్వంహి దేవేశ్వరో సాక్షాత్త్వయా దేయోవరో మమ। అన్యేషాం చైవభూతానామీశ్వరో హ్యసిభూతకృత్॥ యదిదాస్యామి తేదేవ కుండలే కవచం తథా। వధ్యతా ముపయాస్యామి కించ శక్రాపహాస్యతామ్॥

ఇట్లుజెప్పుచు గూడ తనప్రాణాంతకమగు కవచకుండల దానమొనర్చి ఇంద్రునిమోసమునకు లోగినాడు.

శ్రుత్వా కర్ణం ముషితం ధార్తరాష్ట్రాః దీనాస్సర్వే భగ్నదర్పా యివాసన్। తాంచావస్థాం గమితం సూతపుత్రం శ్రుత్వాపార్థాః జహృషుః కాననేషు॥ శక్తివినిమయము నాక్షేపించిరి కథకులు. ఈవినిమయము స్వశరీరరక్షణమునకుగాక శత్రువధ నాశించినది. శత్రువధకై (భీష్మ, కర్ణ, ద్రోణ, భూరిశ్రవ, కృత్రిమమార్గముల ద్రొక్కినాడు యుధిష్ఠిరుడు) స్వశరీరకృంతనమును జేసికొని ప్రాణముల ద్యజించినాడు కర్ణుడు. స్త్రీషు నర్మవివాహేషు వృత్త్యర్థే ప్రాణసంకటే। గోబ్రాహ్మణార్థే హింసాయాం నానృతం స్యాజ్జుగుప్సితమ్ భాగ. 8 స్కం.

వివాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే । విప్రస్య చార్థేహ్యనృతంవదేత । పంచానృతా న్యాహురపాతకాని.

ప్రాణాత్యయే వివాహేంవాసర్వజ్ఞాతివధాత్యయే
కర్మణ్యభిప్రవృత్తేవా నచప్రోక్తం మృషాభవేత్ ॥

ఈ ప్రవచనముల జూచిన లోకములో నెదియు నసత్యమునుండి విడబడియుండదు. ఈ అవకాశమును జేబట్టియే నిత్యసత్యవ్రతుడై నాడు ధర్మజుడు. అబద్ధమాడి గురుజీవితమును హరించినాడు. నిజమాడి తన ప్రాణమును బోగొట్టుకొనినాడు కర్ణుడు. "నాస్తీతినైవ వక్ష్యామి యాచితో యేనకేనచిత్" అనిన కర్ణుని ప్రతిజ్ఞాస్వరూపము శాస్త్రిగారి కిప్పుడు హృదయగతము కాగలదు. కర్ణుడు నిత్యదుర్మార్గుడనియే చిత్రింపనేర్చిన శాస్త్రిగారు "బ్రహ్మణ్యస్సత్యవాదీచ తపస్వీ నియతవ్రతః । రిపుష్వపి దయావాంశ్చ తస్మాత్కర్ణో వృషస్స్మృతః" (భారతము) అను కృష్ణవాక్యమును గమనించెదరు కాక - ఈ సంభాషణము కర్ణుడు జీవించియుండగనే జరిగినది.

## వైమనస్య విచారము

పరిశిష్టము 81పుటలో "గృహాన్వ్రజయథాకామం వైమనస్యంచ మాకృథాః" ఈ వైమనస్య మేయే యితరఘట్టముల వాడబడినదో కర్ణోత్పత్తిలో జూపినను గ్రహించని వీరికి దిరిగి కొన్ని ప్రయోగములను జూపెదను. ఆదిప. 24 - అ. 33 శ్లో.

మారాజన్విమనాభూః, "ఆరణ్య. ప. 2?3 అ 21 శ్లో.
విమనాః - అరణ్య. 81 అ. శ్లో 1 - కర్ణ. ప. 71 - అ.
వైమనస్యం - అధోసీవికోఅ కాంగ్లగ్రహణము చేసినవారే కావున నాంగ్లముతోడి నిఘంటువు నిచ్చెదను.

విమనాః - Sad, perflected, desordered, heart brcken changed, unmind or feeling. A: verse disliking displeased. Absent - thinking - of something else (Wilson.)

వైమనస్యం - Great sadness of sorrow. distracted-sadness - Distilety of feeling - towords.

విమనస్క - Sad. beweldered - heart - broken.

విమనీకృత - Altered unmissed or feeling - sad sarrowfeel - Displeased offended.

గీర్వాణభాష నెరిగియున్నవారని కధకుల కానిఘంటువుల జూపలేదు. వైమనస్యమును భారతము పలుచోట్ల నింపుకొన్నది. ఆశ్లోకములస్థితిని జూచిన వారన్వయవిరోధులు కానేరరు.

నచపశ్యామి సమరే కర్ణం ప్రతి పలాయితుం

కధనము 87 వ పేజి 3 పేరాలో వ్రాసినట్లు - అర్జునుడు వేఱొక యుద్ధరంగమున లేక ఈరంగముననే యున్నాడు. ఎదురుగనున్న కృష్ణార్జులనే సైన్యము పేర్కొని ఆర్తనాదము

లొనరించినది "పాండవాస్తు జయంలబ్ధ్వా తవసైన్యం సమా ద్రవన్ । సమంతా న్నిశితా న్బాణా న్విముంచంతో జయైషిణః" తనసైన్యపరాజయమును జూచికర్ణుని దుర్యోధనుడు ప్రోత్స హించెను. కర్ణుడు భార్గవాస్త్రమును ప్రయోగించి పాండవ పాంచాలసైన్యమును జీకాకుపరచెను. "సంఛన్నా పాండవీసేనా నప్రాజ్ఞాయత కించన । హాహాకారో మహానాసీ త్పాంచాలానాం విశాంపతే" అథాబ్రవీ ద్వాసుదేవం కుంతీపుత్రో ధనంజయః భార్గవాస్త్రంమహాఘోరం దృష్ట్వా తత్రసమీరితం । ముహుర్ము హుర్మాం ప్రేక్ష తేస్మ"

సగాఢవిద్ధ స్సమరే మహాత్మా విఘూర్ణమాన శ్లథ హ స్తగాండీవః। చచాల భీభత్సు రమిత్రమర్దనః క్షితేః ప్రకంపేచ యథాచలోత్తమః । ససాయకః కర్ణభుజప్రసృష్టః హుతాశ నార్కప్రతిమ స్సుఘోరః । గుణచ్యుతః కర్ణధనుః ప్రయుక్తో వియద్గతః ప్రాజ్వాల దంతరిక్షే । తంవీక్ష్య దీప్తం యుధి మాధ వస్తు త్వరాన్విత స్సత్వరమైవ లీలయా । పదావినిష్పష్య రథో త్తమం స ప్రావేశయ త్పృథివీం కించిదేవ । క్షితింగతాః జానుభి స్తేథ వాహాః హేమచ్ఛన్నాః చంద్రమరీచవర్ణాః । "సంధీయ మానం భుజగం దృష్ట్వా కర్ణేన మాధవః । ఆక్రమ త్స్యందనం భూమౌ జానుభ్యా మగమన్హయాః" గుఱ్ఱములు మ్రొగ్గు నట్లు రథమును భూమిలోనికి జొనిపిన కృష్ణరథికుని పౌరుషము నిదివెల్లడించుచున్నది. ఉపాయాంతంతు రాధేయం దృష్ట్వా పార్థో ధనంజయః.

ప్రహసన్దేవకీపుత్ర మిదం వచన మబ్రవీత్
ఏష ప్రయా త్యతిరథో సాత్యకేః స్యందనంప్రతి
సమ్పృష్యతి హతంనూనం భూరిశ్రవస మాహవే
యత్ర యాత్యేవ తత్రత్వం చోదయాశ్వా జ్జనార్దన
మాసోమదత్తేః పదవీం గమయే త్సాత్యతాంవృషః

కృష్ణుడేమి చెప్పెనో చూడండి.

ఏవముక్తో మహాబాహుః కేశవ స్సవ్యసాచినా
ప్రత్యువాచ మహాతేజాః కాలయుక్త మిదంవచః

అను వానివలన నర్జునుడా రంగముననే యున్నాడని స్పష్టమైనది. శక్ష్యామి పాఠము సరసమైనది. పశ్యామి పాఠము నీలకంఠునిది "కర్ణస్య ప్రపలాయితుం" ఆపాఠము సుగమమే. ఎదుర్కొనుటకు శక్తుడనుగాను అనినాడు కను కనే శ్రమేణ గ్రాహయిష్యన్, శ్రమతో నోర్చుకొనుచు బయట పడినాడు. ఎదుటబడిన ప్రమాదము సిద్ధించును. కావున గర్ణు నెదుర్కొనను అనినాడర్జునుడని కర్ణోత్పత్తి 1లో నేను వ్రాసితిని. అర్జునుడెటుపోవునో చూచుచున్న కర్ణుని జూచుచు వెనుకకు వెళ్ళినాడనియే పర్యవసానము. పరిశిష్టము 83 వ పేజి 10 పంక్తిలో వెళ్ళుటకడ్డుతగులుచున్నపు డర్జునుడెట్లు వెనుకకు వెళ్ళినాడని ప్రశ్నించిరి. వీరివలెనే తప్పటడుగులు వేయుచు శ్రమేణ గ్రాహయిష్యన్. వెళ్ళినాడు. ధర్మరాజుతో అర్జునుడు తనయుద్ధస్థితిని దెల్పుచు నిట్లనెను. నాచేత అశ్వత్థామ ఓడింప

బడిన పిమ్మట సైన్యము వికలమగుట చూచి కర్ణుడు నాతో యుద్ధమునకు గవిసెను. కర్ణస్త్వరన్నా ముపాయాతః ప్రమాథీ ఇప్పుడర్జును డేరంగమున నున్నాడందురో శాస్త్రిగారు. అపాస్య కర్ణం ద్రష్టుం భవంతం త్వరయాభియాతః । మన్యేకాల మప యానస్య రాజన్నూక్రురా త్కర్ణాత్తేహా మచింత్య కర్మన్ । మయాకర్ణస్యా స్త్రమిదం పురస్తాద్యుద్ధే దృష్టం పాండవచిత్ర రూపం॥ కర్ణుని తప్పించుకొని (అపాస్య) తప్పునడక నడచినా డని చెప్పబడుటలేదా? "తవ అపయానస్యకాలమేవ" అనినను "అపాస్య" యే మగును?

కృష్ణుడు:

అలమేషమహాబాహుః కర్ణాయే కో హిపాండవ
కింపునః ద్రౌపదేయాభ్యాం సహితస్సాత్వతర్షభః
నచతావత్క్షమః పార్థః కర్ణేనతవ సంగరః ॥

..........................................

దిష్ట్యాపనీతకవచో దిష్ట్యాపహృతకుండలః
దిష్ట్యా విధ్వంసితాశక్తిరమోఘస్య ఘటోత్కచే
యదిహిస్యాత్సకవచ స్తథైవస్యాత్సకుండలః
సామరానపి లోకాన్ త్రీ నేకః కర్ణోజయేద్వశీ
వాసవోవాకుబేరోవా వరుణోవాజలేశ్వరః
యమోవానోత్సహేత్కర్ణం కర్ణం ప్రతిసమాసితుం
ప్రతిసమాసితుమ్ — ఎదుటనిలుచుటకు

ఇది యుద్ధమునుండి పార్థుని తప్పించుటకాదా ? కర్ణార్జున పౌరుషభేదము మనసుకు బట్టించుకొనగలరు కథకులు. అర్జునుడు శాస్త్రిగారు వ్రాసినట్లు యుద్ధమునుండి తప్పించుకొని పోయెనోలేదో తెలియగలదు. అశ్వత్థామ శిరోరత్నమాహరించినచో నాతనిశిరస్సు పోయినట్లే యనుకొనగలిగిన కృష్ణార్జునులు, (భాగవతము) కర్ణునిచేపతితమైన ఇంద్రదత్త పార్థకిరీటమునుచూచుకొని ప్రాణత్యాగమును జేసికొనవలసి యుండగ లజ్జనుజ్జగించిరణభూమిని వర్తించుట హేయముకాదు కాబోలు ? భూమిలో గ్రుంకించిన రథమును "హాతేచ తస్మిన్ధ్వజగే కిరీటినా స్వయం విభుః పార్థివభూతలాదథ, సముజ్జహా రాశు మహాభుజః సతం రథం భుజాభ్యాం పురుషోత్తమస్తతః" రథమునుపైకి దీసికొనుకొనుచుండి నప్పుడు చూచుచుండియు ధర్మచింతనమున యూరకొవిన కర్ణుని తమవలెనే రథమును లేవదీయు సమయమున జంపించిన కృష్ణుడును జంపిన యర్జునుడును ధర్మయుద్ధమును జేసిన పౌరుషవంతులేనా ? చక్రోద్ధరణ మందున్నకర్ణుడు "నత్వంకాపురుషాచీర్ణం మార్గమాస్థాతుమర్హసి । నమాంరథస్థో భూమిష్ఠం వికలంమాంహంతు మర్హసి" అనియుద్ధధర్మమును దమకు జ్ఞప్తికి దెచ్చుచుండిన కర్ణుని నిందించుచు కృష్ణుడు లౌకిక వాక్యముల చాటుట తగినదియేనా ? జిహ్వాయుద్ధమనిన జంకుచుండు కర్ణుడు శాస్త్రిగారి నిర్వచనము ప్రకారము నిరంతరయుద్ధపలాయనుడాయెను. భారతకథనాతిపారీణత వారిచే నట్లుచెప్పించినది.

## మాఘమాం సేగవాయివ

అర్జునస్య యిమే బాణాః నేమే బాణా శ్శిఖండినః.

1. కృన్తన్తి మమగాత్రాణి.
2. తిక్కన యనువాదము
3. మాఘమా కర్కటీప్రోక్తా.
4. సేగవా తదపత్యకమ్.
5. మాఘమాసే గవామివ.
6. గోజాతికి మాఘమాసము బాధాజనకము.

ఇవికథకులు విభజించిన యంశములు. ప్రథమాంశ ములో ఉరస్థన - ఉదరస్థ శబ్దములు నాకు తెలియనట్లు వ్రాసిరి. ఉదరమున కురము వ్రాయుట ముద్రణముతప్పని కర్ణోత్పత్తిలో వ్రాసినది చూచుకొనియు నాపరిజ్ఞానమును దృణీక రించిన వారిఔద్ధత్యము శోచనీయముకాదా? అపత్య ముదర స్థము కాదనుకొనిన వారిపరిశీలనము నేమనవలెనో? తిక్కన నాటికీ నిఘంటునిర్మాణము జరుగలేదని నేనువ్రాసితిని. విరాట పర్వముననే మూలములోలేని కర్కటీగర్భ ముదహరించిన యాతనిప్రకృతిపరిజ్ఞానము మెచ్చతగినదియే. తిక్కన పదమూ డవశతాబ్దివాడు. నీలకంఠుడు పదునేడవశతాబ్దివాడు. తిక్కన నీలకంఠుని నిఘంటువు నెరుగడంటిని. కానికర్కటీగర్భశబ్ద వ్యాప్తి లేదంటినా? అళీ, వళీ, వృశ్చిక, వేణు, రంభాః వీటికేకప్రసూతి మాత్రమని కర్ణోత్పత్తిలో దెలిపితిని.

మాఘుమా సేగవాలున్నవా అని వ్రాసినాను. దీనిని జూడక తిక్కన నాక్షేపించితినని కమబుద్ధిమంతతనమును నాకునేర్ప బోయినారు. శాంతిలోని దాతని తెలుగులో లేదు. ఇట నున్న వానిని గొన్ని వదలి నాడనుట యాతని పరిజ్ఞానమును దృఢీకరించుట కానేరదు. నాబుద్ధిని దిద్దుకోవలెననినారు. విద్యవలన రాదగిన వినయము నటించుకొనని వీరట్లనుట తగినదియే.

మాఘుమా కర్కటీ ప్రోక్తా - మొదలు తుదలేని వివరణమిది. నీలకంఠుడు పై నిర్వచనమును సప్రమాణముగ జూపకయే రచనమును సాగించినాడు. ఇతనికాలమునాటి కెన్ని నిఘంటువులు వ్యాప్తిలోనున్నవి? వానిలో నీనిర్వచన మున్నదా? సేగవాతదత్యకమ్. ఇట్లేయున్న పాఠమును నేననుసరించితిని. అపత్యమనిన సంతానమేకదా, బహువచన ముగ సేగవాను వ్రాయనక్కరలేదన్నాను. సేగవాస్తద పత్యాని అనిన బహువచనమేకదా? "సేగవా" అనినను విస్తరపురాబడిని బహువచనము వచ్చును. మూలములో తదపత్యంతు సేగవా" ఉండగ వ్యాఖ్యలో సేగవాస్తద పత్యాని, అనుట యేమి? మాఘుమా సే గవాఇవ, దీనిలోని సేగవా, పీతపిల్ల ఒకటంచురా లేదా? ఒకపిల్ల పుట్టినమాత్ర మున పృష్ఠము చీలిపోదా? 92 పేజి మొదటి పేరాలో, ఉన్నది. అనిన చాలునే ఇట్లు అననక్కరలేదు. కథనము

308 వ పుటలో "అర్జునస్య" శ్లోకపు టీకలో. మొదట మాఘమా కర్కటీ ప్రోక్తా తదపత్యాన్తుసేగవా, అనియున్నది. ఇట విసర్గలు లేకుండుటచే ఏకవచనముగ దోచును. పిమ్మట నిఘంటువులోని తదపత్యంతు, తదపత్యాని అయినది. ఎందు కట్లు కావలసివచ్చినది? అనుప్రశ్నకు మూలములో సేగవాః అనియున్నది కావున నిఘంటువు 'సేగవా' అని యేకవచన ముగ నున్నదని పరిశిష్టము 92 వ పుట 3 పేరాలో వ్రాసి నాడు. ఈసాంప్రదాయము భాషాసిద్ధమా అని నేనడిగినది వారికర్థము కాలేదు. నిఘంటువునిచ్చి వివరణమిడుటను నేనా క్షేపించినాను. వారిచ్చిన రామాయణశ్లోకవ్యాఖ్యానమట్లు న్నది. చూడగలరు పాఠకులు = శోభసే హ్యాధికం వీర లతయా కంఠసక్తయా। విపరీత యివాకాశే సూర్యో నక్షత్ర మాలయా॥ రామా - కిం - 14వసర్గము - తీర్థీయవ్యాఖ్యా - విపరీతయితి - పత్తమ్యంతం - విపరీతే-రాత్రౌ-సూర్యః - పౌర్ణ మాసీచంద్రః-ఇదివ్యాఖ్య - పరీతంతు దివాప్రోక్తం విపరీతంతు శర్వరీ। పౌర్ణమాసీగత శ్చంద్ర స్సూర్య యిత్యభిధీయతే" ఇతి వచనాత్ —ఉపమానము ననుసరించి వివరణ మిచ్చుచున్నాడు. రాత్రౌ వాకాశే పూర్ణచంద్రో నక్షత్రమాలయా యథా శోభతే తథా కంఠసక్తమాలయా త్వం శోభసే ఇతి—ఈపద్ధతి సరైనది. దీనికి గోవిందరాజుల వాఖ్యలో రాకామధ్యగత శ్చంద్రః అని యున్నది. తీర్థులు పౌర్ణమాసీగతఃచంద్రః అని నాడు—రాకాపౌర్ణమాసీలు మారుటకు గారణమేమియో!

రాకానుమతులను గ్రహించి యుందురు. వ్యాఖ్యాత లిరువురు సూర్యుని జంద్రునిగను ప్రథమావిభక్తిని సప్తమి (రెండింటికి జెల్లఁను విభక్తిగను, జేసిరే కాని విరోధమును జూడరైరి. రాకాపౌర్ణమాసీ — చంద్రుఁడు ప్రకాశవంతులు. అప్పుడు సమీపస్థిత నక్షత్రకాంతి శూన్యమగును. శోభించదు. పై ఉపమానములో మాలాదర్శనము ముఖ్యముకదా ? కావున పూర్ణ చంద్రనిరూపణమిట తగదు. ఉపరాగాదిషు సూర్యః నక్షత్ర మాలయేవ శోభ సే।ఉపప్లుత మివాదిత్యం,అనునదిదియే. ప్రథమ సప్తమి అయినది వ్యాఖ్యాతృనిర్వచనములో. ఎందులకో? ఈతికమకలపాలయి రిరువురువ్యాఖ్యాతలు! స్తోత్కర్తా ప్రకటన మున కిదిత్రోవకాదా ? "నక్షత్ర తారాగ్రహ సంకులాపి జ్యోతిష్మతీ చంద్రమసైవ రాత్రిః" ఇది పూర్ణిమారాత్రి కాదు- శోభసే శ్లోక వ్యాఖ్యానములో గోవిందరాజు తన వాఖ్యకను గుణముగ సమాధానమిడుచు—

"నవో నవోభవతి జాయమానోహ్నాం" చెప్పి గడుసుదనము జూప యత్నించినాడు. ఇట ముఖ్యమయినది ఉత్పాతకాలమందు నక్షత్రములు కనబడునను విషయమే. ఉత్పేతుశ్చవినారాత్రిం తారాః ఖద్యోతసప్రభాః । రాత్రౌ ఇంద్రధనుర్దర్శే దివానక్షత్రదర్శనే।తద్రాష్ట్రనాధనాశ స్స్యాదితి గర్గస్యభాషితం॥ "విపరీతే — నక్షత్రమాలావృతః యదిసూర్యః తద్రాష్ట్రనాధనాశః భవతి. ఉపప్లుత మివాదిత్యం ఉత్క్రాన్తృత

మృషిం తథా'' రామా. అయోధ్యా—112 శ్లోకము వద్ద చూడవలెను. దివ్యాంతరిక్షేచ భూమాచ ఘోరముత్పాతజం భయం। స్వర్భానుకేతునక్షత్ర గ్రహతారార్క-చంద్రజం। దివిచోత్పద్యతే ఘోరం తద్దివ్య మితి కీర్తితమ్। వాయ్వభ్రసంధా దిగ్దాహపరివేష తమాంసిచ। ఖపురం చేంద్రచాపంచ తద్విద్యా దంతరిక్షజం। భూమా వుత్పద్యతే యచ్చ స్థావరం వాథజంగమమ్। తద్వైకాదశికం భౌమ ముత్పాతం పరిచక్షతే॥ ఇతి— వీనినిబట్టి పగటియందుత్పాతములలో నక్షత్రములు దృక్సిద్ధి నందుట స్పష్టము. మిగిలినదంతయు వ్యాఖ్యాతృ పాండిత్య ప్రకటనమునకు మాత్రమే పనికివచ్చును. దీనికి నేను నొక రీతినిర్వచన మిచ్చెదను. ఆకాశే—నక్షత్రమాలయా—విపరీతే— విశేషేణపరీతేసతి-అసూర్యః చంద్రయివ శోభసే; పై వ్యాఖ్యలలోని విరోధము నిదితొలగించగలదు. సూర్యునిచంద్రునిగ నిరువురును మార్చియేయున్నారు కదా; శాస్త్రిగారు నేనిచ్చిన సాంప్రదాయ విషయమును హృదయమున బట్టించుకొందురేమో ?

## 5—మాఘమాంసే గవాయివ

ఇదికథకులు పురాణప్రవచనము చేయుచున్న పూనా చిత్రశాలా(ప్రెస్సు)ముద్రితపాఠము (నీలకంఠుడు వ్యాఖ్యానించినది) ఏప్రతి నాధారపరచుకొని శాస్త్రిగారుమాట్లాడుచున్నారని నేననడుగగా: ఈప్రతి కాదా ప్రతికాదు. మహాభారత ప్రతి, యని వెటకారముగ సమాధానమిడిరి. వారటనట

వావిళ్ళప్రతి, కుంభకోణపుప్రతిఅనికధనములలో వ్రాసియే యున్నారు — నేనుచూచినది మహాభారతమే. వారుచూచు చున్నది చాటుభారతము. నేనుచూచినది వావిళ్ళప్రతి 1929 అనిరి. ఏభారతముల నే జూచితినో కర్ణోత్పత్తి 1లో జూపియే యున్నాను. కొన్నిప్రతులలో వారిచ్చిన పాఠమున్నది. ఆపాఠము తప్పని నేను వ్రాసితిని. పాఠములజూపెదను. — మూలముద్రితము. మాఘమాసే గవామివ

మాఘమాసే గవంయథా

మాఘమాసే గవాయివ

మాగమాసేగవాయివ

మాఘమాంసేగవాయివ

మాంచమాంయోగవాయివ

మాగమా వృశ్చికీ ప్రోక్తా తదపత్యాని సేగవా.

(యథా మాగమాం వృశ్చికీం తదపత్యాని సేగవా వృశ్చికీం మాతరం కృన్తన్తి) ఈవివరణము నీలకంఠుని రచనము బోలినది. కర్కటీ వృశ్చికీ భేదము మాత్రమే.

దేవబోధస్వామి 1050 ప్రాంతమువాడు. భీష్మపర్వము 114 అధ్యాయవ్యాఖ్యలో కృంతంతి మమగాత్రాణి మాఘ మాసే గవామివ పాఠము నిచ్చినాడు. పాండిత్యప్రగల్భత జూపుచు రెండుమూడురకములుగ నర్థముల వ్రాసినాడు. నేల

టూరి వేంకటసుబ్బాశాస్త్రిగారు ప్రజోత్పత్తివత్సరమున ప్రకటించిన మహాభారతప్రతిలో "మాఘమాసేగవామివ" ఉన్నది. కథకులు 92 పేజి 9 వ పేరాలో మాఘమాసే గవామివ పాఠమును నేనుతయారు చేసినాననిరి. అనేకముద్రితా ముద్రిత భారతములలోగల వానినిదిద్దు సాహసము నీలకంఠు నికివలె నాకులేదు. ఈపాఠమిట్లుండుట తగునేమో యని సూచించుట నేను చేయగలను. అక్షుగవ్యత్యాసమున మాగమా పాఠమున్నట్లు వారొప్పుకొనిరి. నేనును జూపియేయున్నాను. రామభద్రను కామభద్రగను, సుబ్రహ్మణ్యను కుబ్రహ్మణ్యగ గాని అబ్రహ్మణ్యగగాని వ్యత్యస్తపాఠములను వీరొప్పుకొనె దరా? ఒప్పుకొనవచ్చునా? బహుపండితపరిశోధితమగు నేటి పూనాభాండర్కరు ఇనిష్టిట్యూట్ వారిమహాభారతపాఠములో "మాఘమాసేగవామివ" ఈయబడినది. పై వారి ముద్రణ పద్ధతిని నేనాక్షేపించితినని కథకులాకచో వ్రాసిరి. బహు పండితపరిష్కృతమై స్థిరీకృతమయిన పాఠముతో ముద్రించిన పిమ్మట ఫుట్నోటులో పాఠాంతరము లిచ్చుట పృథక్త్వ కారణమగునని నాఅభిప్రాయముకాని ఈముద్రితప్రతి సరిఅయి నదికాదనికాదు. పాఠాంతరములచివరకాని వేఱుగగాని ముద్రిం చినబాగని నేననుకొనుచున్నాను. దేవబోధవ్యాఖ్యలో పద ముల విరుపులతో పాండితీచతురిమను జూపినాడని వెనుక వ్రాసియున్నాను. కర్కటార్థములో ఆసేగవాం కర్కటానాం గాత్రం కృన్తన్తి. మాఘం—మఘాభావః, కర్కటానాం మఘా

భావః తిర్యక్త్వాత్ — అని వ్రాసినాడు — ఈవ్రాత నీలకంఠ నిఘంటు వ్యతిరేకము. గోజాతికి మాఘమాసము బాధాజనక మగునట్లు కర్కటములు మాఘమున నశించునను ప్రకృతివిశేష మిందు గన్పడుచున్నది. మాఘమాకు కర్కటార్థము చెప్పబడక "ఆసేగవా" కా కర్కటార్థము చెప్పబడినది. 'మాఘమా కర్కటీ ప్రోక్తా' నిఘంటువు నాటికి లేదుకదా ? మాఘం — ఆసేగవాం అనివిభజించుటచే మాఘమాసే గవా మివ పాఠమాతనిదనియు ఆగోశబ్దమనియు షష్ఠీవిభక్తి అనియు స్పష్టముకదా ? 17 వ శతాబ్దినాడగు నీలకంఠు డీవ్యాఖ్యను జూచియుండడో ? ఇందురవిప్రభలుకల టీకల జూచితినని నాడే — మాఘమా సేగవామివ అనుటతగ దనియు మాఘమాసో అను ప్రథమావిభక్తి చెప్పబడవలె ననియు వ్రాసినారు శాస్త్రిగారు. 'మయా' కు మహ్యాం, అనియు భవతాం, కు 'భవద్భ్యః' అనియు నీలకంఠుడు వ్యాఖ్యానించినాడే. అర్థములో విభక్తులు మారుచున్న ట్లనేకగ్రంథములలో విశేషముగ గన్పడును. మాసే, ను, మాసః అనవచ్చునే—అక్షరవ్యత్యాసమును శాస్త్రిగా రంగీకరించియే యున్నారు. శిశిరము గోబాధాజనకము, మాఘము శిశిరర్తు గతము మాగి. Cold season కన్నడనిఘంటువు — వ్యాకరణపారీణులుకదా ! మీరు ! చూడండి—కౌముది ౩. ౩. 21 సూత్రవార్తికమ్. శ్రూవాయువర్ణనివృతేషు—అవిభక్తికోనిర్దేశః శారో - వాయుః కరణేఘుజ్. శారోవర్ణః - చిత్రీకరణమిహా

ధాత్వర్థః - నిప్రియతే. అప్రియతేఅనే నేతి నిప్రకం - ఆవరణం"
బాహుళకాత్ కరణాక్తః "గౌరివాకృతనీశారః ప్రాయేణ
శిశిరేకృశః" అకృతప్రావరణయిత్యర్థః" మరచిరేమో! మన
సున దెచ్చుకొనుడు శాస్త్రిగారూ? నేనిదివరకు గర్ణోత్పత్తిలో
నిచ్చిన ప్రయోగములు కాకయింకను జూచుడు. ప్రతాతారం
నాధ్యగచ్ఛంత గావ శ్శీతార్ధితాయివ, భీష్మ 49 అ 4 శ్లో
ప్రాకంపత రణేయోధాః గావశ్శీతార్దితా యివ - ద్రోణ 86
17 శ్లో. గృహాన్నైహావబద్ధానాం నరాణామల్పచేతసాం,
కుస్త్రీఖాదతి మాంసాని మాఘమాసే గవాయివ -
ఇక్కడ శాస్త్రిగారివ్రాత యిట్లున్నది. "ఇక్కడ గర్భము
కర్కటికి నాశహేతువైనట్లు కుస్త్రీ పురుషునకు నాశ
హేతువగునని తాత్పర్యము. ఇదినిర్దుష్టము. విమర్శకుల
కున్నది మాటలలో విసరే తప్ప విషయములో పాటవ
మేమియు గనపడదు" అని. ఇందులో నిర్దుష్టపు వినరేమిటో?
నీలకంఠుని వాఖ్య "గృహేతి=ఖాదతి. స్వాపరాధై స్తం
సంతాపయతి. శుష్కంకరోతి. మాఘమాం-కర్కటీంసేగవాః-
తదపత్యాని = కర్కట్యానాశ హేతుర్గర్భవేతి ప్రసిద్ధమ్.
చలికారికి తినుచున్నదన ఎండింపజేయుచున్నది. తపింపజేయు
చున్నది. అదియొక (Idiam) మాట మాత్రమే. కర్కటీ
సంతానము నాశహేతువే కాని తాపకృశత్వముం గల్గించదు.
శాస్త్రిగారి కుస్త్రీ విభక్తిభేదప్రాప్తి (మాసః) నొందుట గమ
నింపబడనే లేదు. మాఘము శిశిరర్తుగతము కాదందురా కథ

కులు ? నేనిచ్చిన సప్తశతిశ్లోకము "విక్రీణాఇనూహూమూనమి । పామరోపా ఇడింతఇళ్లేన ణిష్ఠూమ ముౢరస్వి । నామలి యధణో పడిచ్ఛన్తో" మాఘుము పులివలె గోజాతిని నశింపజేయును "వంగదేశమున శిశిరమున గోవులకు కొమ్ములనుండితోకలవరకు గోనెపట్టాలను గప్పెదరు." ఈవిషయము తృణీకరించెదరోవీరు! ఇన్ని మాటలేటికి ! శాస్త్రిగారూ ? శిశిరర్తువు గోబాధాజనక మందురా లేదా ? ఈ ప్రకృతిని మీరు కాదన లేకుండుట మీ వ్రాత తుషాఖననమే అయినదని నామనవి. 94 పేజీలో 8 పేరావరకు పంక్తులు వ్రాయతగినవికావు. స్వస్త్యస్తు"

---

# అనుబంధము

బెంగాలీలో ప్రకటింపబడిన భారతములలో నాలుగు ప్రతాపచంద్రరాయి (కలకత్తా) ప్రతి ననుసరించినవియే. రెండు మాత్రము కన్నడములోని విక్రమార్జున విజయమువలె స్వేచ్ఛ ననుసరించినవి. కాశీ విశ్వవిద్యాలయోపన్యాసకులు - వాసవ - గారు భారత సావిత్రి అను పొత్తములోఁ 'దుర్వాసుడు వరదాతకాడు గర్భదాత' అని వ్రాసిరి. ఇట్టివ్రాత యొకటి తెలుగులో పూర్వము వ్రాయబడినది. రాజకుమారి, సుందరి, యువతి కీపాటు కలుగుట శోచనీయము. దుర్వాసుడు కొందరు పౌరాణిక ఋషులవలె కాముకత్వము నంటించుకొనిన వాడని విని, కని, యుండలేదు. కుంతి యువతి, సద్యస్స్నాతి యగును. మిగిలిన భారతములు రెంటను సమానములే. బరద్వాను హిందీ భారతము వనపర్వమున నీగాథలేక ఉద్యోగపర్వముననున్నది. కుండలాహరణగాథ ఘటోత్కచవధ కాకరమయిన ఇంద్రదత్తశక్తి విషయకమై కర్ణపర్వముననున్నది. ఓఢ్ర భారతములోని "కర్ణనామకరణవిషయము నాదేశములో నేకాక చాలా ప్రాంతములగూడ కర్ణమునుండి కర్ణుడు పుట్టినాడనియే ప్రసిద్ధి కలిగియుండుటచే" చేర్చబడుట తగియే యున్నది.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | తాన్పృతి | తాన్ప్రతి |
| ,, | 17 | హ్మా | హ్మో |
| 12 | 12 | తత్కృ | తతు్క |
| 13 | 21 | ద్వ్యాస | ద్వ్యాన |
| ,, | 22 | ఽము | రను |
| 16 | 11 | వస్త్తా | వస్త్రా |
| ,, | ,, | రజస్యలా | రజస్వలా |
| 17 | 12 | రాజు | రాజ |
| 20 | 17 | ప్రధన | కథన |
| 25 | 3 | చూచి | తూచి |
| 26 | 4 | గలచొప్ప | గల నావలె చొప్ప |
| 29 | 20 | అస | అప |
| 31 | 16 | పరా | పరా |
| 42 | 9 | త్కన్యా | ద్వారీ |
| 14 | 19 | రెండవ, కథా, పిమ్మట | |

"రాజ కన్యక కావున రజస్వలయను జంకవసరములేదు. గర్భమగునను భయమె గమనార్హము ఏజాతి కన్యకయైన

నాకాలమున వివాహమునకు ముందురజ స్వల కాకూడదు అను నియమము కలదను నిదర్శనములు'' అని చదువవలెను.

| | | | |
|---|---|---|---|
| 50 | 1 | త్యా | తా |
| 78 | 4 | రెండయ్యో | రెండయ్యో వెన్వోంట |
| 81 | 13 | దూషణము | టీకా |
| 87 | 8 | ప్రాపిత | కుంతికి గర్భము |
| 91 | 9 | కామయా | కామయా- |
| ,, | ,, | సత్యే | సత్యేన- |
| ,, | 16 | పాధా | పాదా |
| 93 | 20 | థ్య | ద్య |
| 99 | 4 | కుంతలా | కుండలా |
| 102 | 13 | Fool | Ful |
| 111 | 10 | నేనునొక | వారి మఱొక |

